

శ్రీమతే రామానుజాయ నమః

# తిరువాయ్‌మొழ్రి వ్యాఖ్యానాలలో - ఎమ్బెరుమానార్ నిర్వాహాలు, వార్తలు, ఐతిహ్యాలు

## ప్రథమ భాగం

సంకలనం - వివరణం

పండితరత్న డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

ఉ.వే. శ్రీమాన్ వాధూల వేంకటనరసింహాచార్యస్వామి

( అయోధ్య స్వామి ) వారి తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక.

2020

2

**తిరువాయ్‌మొழி వ్యాఖ్యానాలలో - ఎమ్బెరుమానార్**
**నిర్వాహాలు, వార్తలు, ఐతిహ్యాలు**
**ప్రథమ భాగం**


**సంకలనం - వివరణం**

**పండితరత్న డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు**



**ప్రథమ ముద్రణ - ఫిబ్రవరి, 2020**

**ప్రతులు -**

**ఆవిష్కరణము - 4-2-2020**





డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.
శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి,
భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ :




# హార్దశుభకామన

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆళ్వార్ శ్రీసూక్తులకు, వాటిలోని సారస్యాలకు ఉన్న వైభవం మరిదేనికీ కనిపించదు. ఆళ్వార్ శ్రీసూక్తులు వివిధాచార్యులచే పరస్పర విలక్షణంగా సమన్వయించబడ్డాయి. తరువాయి మొళి మొదలైన ప్రబంధాల వ్యాఖ్యానాల్లో ఐతిహ్యరూపంగాను, సమన్వయ వైలక్షణ్య రూపంగాను వివిధ విశేషాలను ఉట్టంకించడం కనిపిస్తుంది.

అయితే, ఇలా ఆచార్యులు చూపిన ఈ ఐతిహ్యాలకు గాని, ఆయా ఆచార్యులచే, ముఖ్యంగా యామున రామానుజాదులచే చేయబడినట్లుగా చెప్పే విలక్షణ సమన్వయాలకు ప్రమాణం ఏమిటి? అన్నప్రశ్నకు సమాధానం కష్టం. అయినా ఆయా ఆచార్యుల కాలంలోనివారు స్వయంగా ఆయా సన్నివేశాలను అనుభవించి గ్రంథస్థం చేయవచ్చు. ఉదాహరణానికి, సరస్వతీదేవి ముందు, కాశ్మీరంలో 'కప్యాసశ్రుతి' సమన్వయం చేసి రామానుజులు ఆమెను మెప్పించారనడానికి వేదార్థ సంగ్రహాది గ్రంథాల్లో చేసిన ఉట్టంకనలు ఆధారంగా (**"గంభీరాంభస్సమద్భూత"** – ఇత్యాదులు) ఆకాలానికే చెందిన గరుడ వాహనాదులు తమ గ్రంథాల్లో వాటిని పేర్కొనడం గమనించవచ్చు. అంతేకాక తరువాత కాలానికి చెందిన ఆచార్యులు, ఆ సమన్వయాలను (తత్త్వసార గ్రంథంలో వాత్స్యవరదగారువులు చూపినట్లు) తమ గ్రంథాల్లో ఆవిశేషాలను విశేషంగా ఉట్టంకించడాన్నిబట్టి ఈ ఐతిహ్యం వాస్తవమేనని దృఢంగా విశ్వసించడంలో అభ్యంతరం ఏముంది?

గరుడ వాహనుడు కప్యాసశ్రుతికి రామానుజులు చేసిన సమన్వయాన్ని ఈ క్రింది శ్లోకంలో ఉట్టంకించాడు.

**కప్యాసం వచనమభాణి శంకరేణ**
**త్రయ్యంతే కపిగుదమిత్యయుక్తవాచ్యమ్ ।**
**అస్య త్వం కమలవదిత్యనన్యథార్థం**
**యద్వ్యాఖ్యః తదపి మమాపి పూజనీయః ॥** అని

ఇదే ఐతిహ్యాన్ని రామానుజుల శిష్యులైన ఆంధ్రపూర్ణులు తమ యతిరాజవైభవస్తుతిలోనూ ఉట్టంకించారు.

అలాగే మరికొన్ని శ్రుతివచనాల సమన్వయం విషయంలో రామానుజుల విలక్షణ సమన్వయ శైలి వారి గ్రంథాల ద్వారానే కాక, అక్కడక్కడ సమకాలికులైన ఆచార్యుల సమన్వయ వచనాలను బట్టి కూడా గమనింపవచ్చు. **'తత్త్వమస్యాది వాక్యార్థ తత్త్వనిర్ణయకారకః'** అన్న రామానుజ సహస్ర నామంవారు చేసిన శ్రుతి సమన్వయాల వైలక్షణాన్ని చూపుతుంది.

ఆంధ్రపూర్ణుల యతిరాజవైభవంలో, రామానుజులు దివ్యప్రబంధాను సంధానం తన శిష్యులతో కలసిచేసేవారని, ఒకప్పుడు వారు వెలిబుచ్చిన అభిప్రాయం తమదికూడా కావడాన్ని గుర్తించి యతిపతి ఆనందించారని, ఈ వైనాన్ని చెప్పడం జరిగింది.

**కదాచిదంతర్మతమర్థచింతాం**
**కస్యప్రబంధస్య చిదాచరంతమ్ ।**
**యతీశ్వరం వీక్ష్య సపూర్ణపుత్రః**
**తం చింతితార్థోయమిత్యవోచత్ ॥**
**తదూరితార్థం నిజ చింతితం తం**
**శ్రుత్వా యతీశోప్యతి విస్మితస్సన్ ।**
**నాథాన్వయాద్వేద తథేతి మత్వా**
**మద్జ్ఞానపుత్రేత్యభిషస్వజే తమ్ ॥**

ఈ ఉట్టంకనాన్నిబట్టి, రామానుజులు తమ మఠంలో దివ్య ప్రబంధ వ్యాఖ్యానం స్వయంగా చేసి, తమ శిష్యులకు అందించేవారని స్పష్టం. ఇక్కడ

ఉట్టకింపబడిన పూర్ణపుత్రుడు 'కురుగైప్పిరాన్ పిళ్లాన్' అని చెప్పబడే కురుకేశవర్యుడే. ఈ కురుకేశులే రామానుజుల ఆదేశంతో తిరువాయి మొళికి 'ఆరాయిరప్పడి' అనే వ్యాఖ్యానాన్ని వెలయించారు. మాలాధారుల సమన్వయా లకు, రామానుజుల సమన్వయాలకు కొంత వైవిధ్యాలుండేవని, మాలాధారుల సమన్వయాన్ని రామానుజులు అంగీకరించక, 'ఇది యామునుల హృదయం కాద'ని నిర్ద్వంద్వంగా తిరస్కరించినవైనాన్ని ఆకాలానికే చెందిన గ్రంథాలు ఉట్టంకించాయి. దీన్నే తరువాతి కాలానికి చెందిన ప్రపన్నామృతం ఇలా ఉట్టంకించింది.

**భంగ్యంతరేణగాథాయాః కస్యచిద్వైష్ణవోత్తమః ।**
**ఉక్తవానశ్రుతత్వేన శిష్యాయార్థం విచక్షణః ॥**

**తచ్ఛృత్వా లక్షణాచార్యో మాలాధరమథాబ్రవీత్ ।**
**న చైవమర్థోగాథాయాః తస్యాశ్చాన్యోస్తి దేశిక ॥**

ఇత్యాది వచనాలనుబట్టి రామానుజులు కొన్ని స్వతంత్ర భావనలు కలిగినవారని, యామునులు ఏ అభిప్రాయాన్ని వాస్తవంగా ఆవిష్కరించి ఉంటారో భావించి గ్రహింపగలిగిన సామర్థ్యంకలవారని అవగతమౌతుంది.

ముఖ్యంగా శఠారి శ్రీసూక్తుల సమన్వయంలో, వారు, పలుతావుల్లో తమ అభిప్రాయాలను ఆవిష్కరించారని నంబిళ్లవారు తమ వ్యాఖ్యలో పలుతావుల్లో పేర్కొన్నారు. వీటినే మనవారు రామానుజుల నిర్వాహాలుగా చెబుతున్నారు.

ఈ నిర్వాహ ప్రక్రియలో కొన్ని ఐతిహ్యాలు, మరి కొన్ని ఆయా పాశురాల అర్థాలను నిర్వహించడం, ఆయా సందర్భాలలో ఆచార్యులు పేర్కొన్న వార్తలు, సంవాదాలు, ఉదాహరణాలు, ప్రమాణాలు ఇలా పలురకాలైన విశేషాలు పూర్వాచార్యులవ్యాఖ్యానాల్లో ఉన్నాయని శ్రీమాన్ శింగరాచార్యస్వామి వారు తమ గ్రంథంలో పేర్కొన్నారు.

భగవద్విషయంలో భగవద్రామానుజ నిర్వాహాలు ఉన్నాయి. వాటిని అధ్యయన (కాలక్షేప) సమయంలో అవగతపరచుకొని వాటిలోని అందాలను, సాంప్రదాయిక వైభవాన్ని అనుభవించినా, వీటిని విశేషదృష్టితో అవగాహన

పరచుకొని ప్రత్యేకంగా అనుసంధించే విధంగా ఉ.వే. శ్రీమాన్ శింగరాచార్య స్వామి వారు వాటినన్నింటినీ, ఏకత్రితంగా చేసి అందిస్తున్నారు.

ఒక్కో అంశాన్ని (నిర్వాహాన్ని) విశదపరచడం ద్వారా విషయావగాహనకు సౌలభ్యాన్ని సంతరించారు స్వామివారు. శ్రీమాన్ శింగరాచార్యస్వామివారిచే ఈ ప్రయత్నం చేయించిన వారు శ్రీమాన్ శఠకోపాచార్య స్వామివారు. వీరుతమ తండ్రిగారి తిరునక్షత్రం పురస్కరించుకొని ఈ గ్రంథాన్ని ఆవిష్కరింప చేస్తున్నందుకు గ్రంథకర్త శ్రీమాన్ శింగరాచార్యస్వామివారికి, ప్రకాశకులైన శ్రీశఠకోపాచార్య స్వామివారికి సాంప్రదాయికలోకం కృతజ్ఞతాబద్ధమై ఉంటుంది.

భాగవత విధేయుడు

**సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు**

భాగవతామృతవర్షి, ఉపన్యాసదివాకర,
శ్రీరామాయణసూక్తిసుధాకర, సారార్థవాచస్పతి
**ఉ.వే.శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారు**
సింహాచలం.

శ్రీమతే రామానుజాయ నమః　　　　శ్రీసింహాద్రినాథాయ నమః

# సాధువాదము

ఉర్విజనుల నెల్ల ఉద్ధరింపనెంచి అవతరించిన ఆళ్వార్ల దివ్యసూక్తులు కేవల విజ్ఞానదాయకములు మాత్రమేకాక అమందానంద సంధాయకములు. వారి గ్రంథములు తాము ఆలోచించి అనుగ్రహించినవి కాక, భగవానుని నిర్హేతుక కృపాకటాక్షకారణముగా తాము భగవత్స్వరూప రూప గుణ విభూతులను ప్రత్యక్ష దర్శన సమానాకారముగ దర్శించి అట్లు దర్శించుట వలన కలిగిన ఆనందము లోపల ఇముడక బయటకు ప్రవహించగ ఆవిర్భవించినవే వారి దివ్యప్రబంధములు. ఆళ్వార్ల అంతరంగపు లోతుల నారసిన పూర్వాచార్య వ్యాఖ్యానములు మాత్రమే అందలి అర్థజాతమును మనకందించును. అట్టి పూర్వాచార్య వ్యాఖ్యానములలో తిరువాయ్మొళి దివ్య ప్రబంధ వ్యాఖ్యానము తలమానికమైనది. అనేకమంది పూర్వాచార్యుల దివ్యసూక్తులతో, నిర్వాహములతో రసబంధురమైన వ్యాఖ్యానమది. అందలి భగవద్రామానుజుల నిర్వాహములను ఈ లోకమునకు తెలుగు భాషలో అందించుచున్న వ్యాఖ్యానవాచస్పతి ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామి వారికి తెలుగువారంతయూ ఋణపడి యున్నారనుట అతిశయోక్తి కానేరదు. ఆళ్వార్ల దివ్యప్రబంధములకు సంస్కృత వేదాంతముతో ఐకకంఠ్యమును తెలుపుటకై అవతరించిన మహనీయులే భగవద్రామానుజులని **"పురా సూత్రైర్వ్యాసః శ్రుతిశతశిరోర్థం గ్రథితవాన్ వివ వ్రేతం శ్రావ్యం వకుళధరతా మేత్య స పునః, ఉభావేతౌగ్రన్థౌ ఘటయితుమలం... పునరజ్ఞే రామావరజ ఇతి స బ్రహ్మముకురః ॥"** అను శ్లోకము తెలుపుచున్నది. అట్టి భగవద్రామానుజుల నిర్వాహములు

సంక్షిప్తసుందరములు, గంభీరములు కూడా. ఉదాహరణముగ భగద్విషయము లందలి ఐదవ పదిలోని పదియవ తిరువాయ్‌మొళి యందలి ఆరవ పాశురమగు **"నిన్టవాఱుమ్ ఇరున్దవాఱుమ్ కిడన్ద వాఱుమ్"** అను పదములకు శ్రీరామచంద్ర, కృష్ణచంద్ర, అర్చామూర్తి పరముగా వివిధ సన్నివేశ దివ్యదేశ పరముగ పూర్వాచార్యులచే అర్థము యోజింపబడినది. అచ్చట – **"ఇవై యెల్లామ్ తొట్టిలిలే ఎన్టరుళిచ్చెయ్‌దార్ ఎంబెరుమానార్"** అను వాక్యము. **"అవిస్తృతాః సు గమ్భీరాః "** అను రీతిని దర్శింపచేయుచున్నది.

ఇట్టి అనేక సూక్తులను ఏకత్రజేర్చి ప్రామాణికముగ అందజేసిన స్వామివారికి అనేక కృతజ్ఞతాంజలులు. తమ పితృపితామహ ప్రపితామహుల తిరునక్షత్రోత్సవము లను అత్యంత భక్తినిష్ఠలతో నిర్వహించుచు, ఆయా సందర్భములలో అనేక పెద్దల గ్రంథములను కూడా వెలువరించుచున్న ఉ.వే. శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్య స్వామివారు ధన్యజీవులు. వారికనేక సాధువాదములను తెలుపుచూ, సంప్రదాయ నిరతులగు వారందరూ ఈ గ్రన్థమును పఠించి, తమ జనిని సార్థకము చేసుకొన వలెనని కోరుచున్నాను.

శ్రీమతే నారాయణాయ నమః   శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః   శ్రీమతే రామానుజాయ నమః



# భక్తినివేదన

BHAKTHINIVEDANA



Editor : Dr. Addanki Srinivas

## వాచవి

ద్రావిడవేదం ఒక సాగరం. అందులో ఇంత అని చెప్పలేని విలువగల అనర్ఘరత్నాలు ఉంటాయి. పరమాత్మను 'ఉయర్వఱ వుయరుమ్ పెరున్దిఱలోన్' అని నమ్మాళ్వార్లు సాయించినట్లుగా ఆ రత్నాల విలువ - భగవత్తత్త్వాన్ని 'ఎన్నముదమే' అంటూ స్వామి వైభవాన్ని అనుభవైకవేద్యంగా ఆస్వాదించిన మహనీయులే అవగతం చేసుకోగలరు. అలాంటి మహనీయులు ఆళ్వారులు, భగవద్రామానుజులు ఇంకా పూర్వాచార్యులూను.

నాలాయిర దివ్యప్రబంధం వేదానికి ప్రతిబింబమే కాదు, వేదం నిర్వచించలేని భగవద్గుణవైభవాన్ని విశేషంగా దర్శింపచేసిన మహత్త్వపూర్ణమైన ప్రబంధం. కవితాదృష్టితోనూ చూస్తే చమత్కారానికి కైతలకాటపట్టు. ధ్వని ప్రధానమైన ఉత్తమ కావ్యం. ఇందులోని ప్రయోగాలు స్వీయ అస్తిత్వాన్ని నిలుపుకొంటూనే నవ్యదర్శనీయమైన విశేషార్థాలను కళ్ళముందు సాక్షాత్కరింపజేస్తాయి. అయితే అవి మామూలు కళ్ళకు కనిపించవు. భగవదనుభూతి అనే అంజనాన్ని ధరించిన నేత్రాలకే పరమార్థసాక్షాత్కారం. అలా దర్శించిన వారు మన పూర్వాచార్యులు.

కవి హృదయాన్ని జాగ్రత్తగా పొదివి పట్టుకొని, అందులోని మాధవ ప్రేమ గుణాల్ని విపులీకరించి ప్రపన్నుల హృదయగతం గావించాల నైపుణ్యం ఉన్నవారు వ్యాఖ్యాతలు. రవి గాంచనిచో కవి గాంచునే కదా! అన్నది ఆర్యోక్తి. అయితే కవి గాంచనివి కూడా వ్యాఖ్యాత గ్రహిస్తాడు. గ్రహించాలి. లేకపోతే అతడు ఉత్తమ వ్యాఖ్యాత కాలేడు. ఇలాంటి ఉత్తమోత్తమ వ్యాఖ్యాతృ పదవిని అలంకరించిన వారెందరో మన భాగ్యంకొద్దీ పూర్వాచార్యులుగా మనల్ని అనుగ్రహించారు. ఇప్పుడు మరో విశేషం ఉంది. విష్ణుపాదం నుండి ఉద్భవించిన గంగ పరమపావని. జటాజూటంలో కూర్చొంటే ఏమిటి ఉపయోగం? దానిని లోకంలోకి ప్రవహింపచేయాలి. అందుకు భగీరథుడు రావాలి.

ఆళ్వారుల హృదయాలయ పరంధాముని ప్రసాదమే నాలాయిర దివ్యప్రబంధం. ఆ పాశురములనుండి ఉద్భవించింది ద్రావిడప్రబంధం అనే గంగ. దాని వ్యాఖ్యాతలు తమ ద్రావిడ వ్యాఖ్యానాల ద్వారా శివుని జటాజూటం దాకా తీసుకువచ్చారు. ఆ తరవాత పరమపవిత్రమైన ద్రావిడ వాఙ్మయ మందాకినిని ప్రపన్నుల హృదయక్షేత్రాలలోకి ప్రవహింపచేసిన ఆ మహనీయులు అపరభగీరథులనదగినవారు ఇహం పరం ఎందరో ఉన్నారు. ఆ పరంపరలో మనల్ని అనుగ్రహిస్తున్న అద్యతనకాల మహావిద్వాంసుల మనకు ప్రత్యక్షమైనవారు ఉ.వే. శ్రీమాన్ ఈ.వి. సింగరాచార్యస్వామి. వీరి తెలుగు-ద్రావిడాగమరహస్యార్థాలను తెరవడానికి పూర్వాచార్యులు నేలమాళిగల్లో దాచిపెట్టిన వేదాంతరత్నాల నిధినిక్షేపాలను తెచ్చి మన చేతుల్లో పెట్టడానికి సదా సంసిద్ధులు. అంతేకాదు 'అనన్యశరణాగతి'లో చేరి ద్రావిడ వేదప్రభావాన్ని లోకానికి విశదం చేయడానికి మహాప్రయత్నాన్ని కూర్చింది కూడా. అలాంటి నిబద్ధతకల వీరి కలం నుంచి జాలువారిన మరో గ్రంథరాజం 'తిరువాయ్ మొళి ప్రబంధ వ్యాఖ్యానాలు - ఎమ్బెరుమానార్ నిర్వాహాలు, వార్తలు, ఐతిహ్యాలు'.

సంస్కృత-ద్రావిడ వేదాంతాలలోని తత్త్వార్థాలను వ్యాఖ్యానప్రసంగాలు, అందిస్తే - వాటిని ఐతిహ్యాలనీ, వార్తలనీ, సంవాదాలనీ విశేషించగా గోచరిస్తాయి. ఆళ్వారుల అంతరంగాన్ని ఆవిష్కరించడానికి వ్యాఖ్యాతలు వీటిని ఉపకరణాలుగా చేసుకున్నారు. ప్రతిపాదితాంశాలను ఇవి ఉపబృంహణాలుగా సమర్థిస్తాయి. ఇవి ఎక్కడా ఇంతకుముందు గ్రంథస్థం కాలేదు. మూలాన్ని విశ్లేషిస్తూ వాటిలో తత్త్వరహస్యాలను విపులీకరించడం కోసం వ్యాఖ్యాతలు ఐతిహ్యాలను గ్రంథస్థం గావించారు. ఈ గ్రంథం ద్రావిడాగమవిద్యార్థులకు పుష్టిని చేకూరుస్తుంది!

# ప్రాగుక్తి

**నమస్తస్మై యతీశాయ కరుణామృతసింధవే ।**
**యదుపజ్ఞం ప్రబంధానాం సర్వం వ్యాఖ్యానవాఙ్మయమ్ ॥**

నాలాయిరదివ్యప్రబంధమని, ద్రావిడవేదమని వ్యవహరింపబడే పన్నిద్దరు ఆళ్వారుల దివ్యమధురసాహిత్యం కమనీయద్రావిడ భాషలో విలసిల్లుతున్నది. ఈ అమూల్యసాహిత్యంలోని భాషాపరమైన అవధులను పరిగణించకుండా ఆసేతుహిమాచలంగానే కాక, ప్రపంచవ్యాప్తంగా సహృదయులైన సాహిత్య రసికులు, తత్త్వజ్ఞులు అందఱు ఈ సాహిత్యాన్ని గౌరవించి, అందులోని రస్యరహస్యార్థాలను ఆస్వాదించి, ఆనందిస్తు న్నారు. ఈ దివ్యప్రబంధాలకు వ్యాఖ్యాన రూపమైన వివరణ వాఙ్మయం శ్రీరామానుజుల ఆదేశంతో వారి సమకాలీనులు, వారిచే జ్ఞానపుత్రులు అయిన తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ (కురుకేశులు) అనే ఆచార్యవర్యులు తిరువాయ్మొళ్ళికి రచించిన ఆఱు వేల గ్రంథపరిమితిలోని (గ్రంథ మంటే – ముప్పై రెండు అక్షరాలు) ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంతో ఆరంభమై, శ్రీమద్వర వరమునుల పర్యంతం, పిళ్ళైలోకమ్ జీయర్ పర్యంతం క్రమక్రమంగా పెరిగి విశ్వరూపాన్ని దాల్చింది. ఈనాటికీ ప్రపంచ వ్యాప్తంగా ఎందరో పండితుల, విమర్శకుల దృష్టిని ఆకర్షిస్తూ క్రమక్రమంగా తన త్రివిక్రమ పరాక్రమాన్ని వ్యక్తం చేస్తున్నది. మూల గ్రంథాలైన ఆళ్వార్ల దివ్యప్రబంధా లకు, వాటికి పూర్వాచార్యులు రచించిన రసఘనాలైన వ్యాఖ్యానాలకు పలు భాషలలో చాలాకాలం క్రితమే చక్కని అనువాదాలు వివరణలు విలసిల్లాయి. ఉభయవేదాంతాలనబడే సంస్కృత వేదాంత – ద్రావిడవేదాంతాలలోని తత్త్వార్థాల ఐకకంఠ్యాన్ని సప్రమాణంగా, సశాస్త్రీయంగా, నిర్ద్వంద్వంగా నిరూపించే శ్రీవైష్ణవ పూర్వాచార్యవ్యాఖ్యాన వాఙ్మయం నిరుప మానం, అనితరసాధ్యం కూడా. (నాథమునుల కాలంలోనే దివ్యప్రబంధాల లోని కొన్ని భాగాలకు **"తమ్బిరాన్పడి"** అనే వ్యాఖ్యానం రచింపబడి, అది శ్రీరంగంలోని శ్రీరంగ నాథుని అధ్యయనోత్సవాలలో అరైయర్ స్వాములు చేసే అభినయ సమయంలో అనుసంధింపబడుతున్నా, ఆ సాహిత్యం లోకానికి అందలేదు. గుప్తంగానే రక్షింపబడుతున్నది)

ఈ పూర్వాచార్య వ్యాఖ్యానాలలో గోచరించే అపూర్వమైన అంశాలలో ఐతిహ్యాల, వార్తల, దృష్టాంతాల, సంభాషణల ప్రస్తావన ముఖ్యంగా గమనించ దగినది. **"నాథోపజ్ఞం ప్రవృత్తమ్"** అని శ్రీమన్నాథమునులతో ఆరంభమైన ఆచార్య పరంపరలోని పలువురు పూర్వుల, సమకాలీనులైన ఆచార్యులకు, వారి శిష్యులకు, ఇంకా పలువురికి సంబంధించిన పలు ఐతిహ్యాల, వార్తల, దృష్టాంతాదుల ప్రస్తావనను వ్యాఖ్యాతలు ఆయా సందర్భాల వివరణలో, తదనుగుణంగా చేశారు. ఐతిహ్యాలనేవి ప్రధానంగా చారిత్రకమైన, వృత్తిగతమైన అంశాలను ప్రతిపాదించేవిగా, వార్తలనేవి ఆయా సూక్తులలోని రస్య రహస్యార్థాలను, తత్త్వార్థాలను, సాంప్రదాయి కాంశాలను తెలిపేవిగా ఉంటాయి. ఒక వ్యక్తికి సంబంధించిన విశేషాలు ఆ వ్యక్తికి, ఇతరులకు మధ్య జరిగిన సంభాషణల ద్వారాగాని, ఈ విధంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా వ్యక్తం అవుతాయి.

వ్యాఖ్యాతలైన మన పూర్వాచార్యులు ఐతిహ్యాలను, వార్తలను, సంవాదాలను (సంభాషణలను) ప్రస్తావించడంలో ఉద్దేశ్యంకూడా గమనించదగినది. తరతరాలుగా మౌఖికంగా అందే ఈ అపూర్వమైన విజ్ఞాన సంపదను గ్రంథస్థం చేయడం ద్వారా అవి కాలగర్భంలో అంతరించి పోకుండా ఉంటాయనేది ఒక విషయం కాగా, **"అప్తవాక్యం ప్రమాణమ"**నే రీతిలో తాము వివరించి తెలిపే అర్థాలకు, అంతకు ముందున్న పరమ ప్రామాణికులైన పూర్వాచార్యుల సూక్తులపట్ల తమకు గల గౌరవాన్ని వ్యక్తం చేస్తూ, వాటిని ఉదాహరించి, ప్రామాణ్యాన్ని నిరూపించడం ఇంకొక అంశం. ఈరీతిలోని ఐతిహ్యాల, వార్తల దృష్టాంతాల, సంభాషణల ఉట్టంకనం మన పూర్వాచార్యుల వ్యాఖ్యాన వాఙ్మయంలో మాత్రమే ప్రథమంగా, ప్రచురంగా కన్పిస్తుంది. ఇది వారి హృదయవైశాల్యానికి, నిశితమైన వ్యాఖ్యాన వైఖరికి, సామాజిక స్పృహకు, చారిత్రక దృష్టికి తార్కాణంగా కూడా చెప్పవచ్చు.

**1. ఐతిహ్యాలు :**

ఆళ్వార్ల శ్రీసూక్తులను వివరించేటపుడు వ్యాఖ్యాతలు ఆచార్యుల జీవనకాలంలో సంభవించిన సంఘటనలను ప్రస్తావించి, ఉదాహరించారు. ఇవే ఐతిహ్యాలు దీనికి నిదర్శనంగా పెరియాళ్వార్ల తిరుమొళిలోని **"ఒరు మకళ్**

**తన్నైయుడై యేన్ తిరుమకళ్‌పోల్ వళర్‌త్తేన్ శెజ్ఞణ్‌మాల్ తాన్ కొణ్డుపోనాన్"** (నేనొక కుమార్తెను కల్గి ఉన్నాను. ఆమెను లక్ష్మివలె పెంచాను. ఆమెను ఎఱ్ఱని పద్మాలవంటి కన్నులను కల స్వామి తీసికొని పోయాడు) (3-8-4) అనే సూక్తిని వివరించే శ్రీమణవాళమహామునులు, కూరేశుల పరమపద గమనాన్ని సహించలేక విలపిస్తూ ఈ సూక్తిని ఉట్టకించిన ఐతిహ్యాన్ని ప్రస్తావించారు. **"ఇతి హ, ఇతి హ"** (ఈవిధంగా, ఈవిధంగా జరిగింది) అని చిరకాలంగా పలికే వృత్తాంతమే ఐతిహ్యం. ఇటువంటి ఐతిహ్యాలు వందలాదిగా ప్రబంధ వ్యాఖ్యానా లలో ప్రస్తావింపబడ్డాయి.

**2. అర్థనిర్వాహాలు :**

ఆళ్వార్ల పాశురాలను వ్యాఖ్యానిస్తూ పూర్వాచార్యులు తమకు ముందున్న పలువురు ఆచార్యులు ఆయాసూక్తులు పలు రీతులలో రస్యార్థాలను, తత్త్వార్థాలను వివరించిన విధానాన్ని, వారి వారి నామాలను ఉట్టంకిస్తూ, "వీరు ఈ విధంగా అన్నారు, వీరు ఈ విధంగా వివరించారు" - అనే వివరణలను తమ వ్యాఖ్యలలో ప్రస్తుతించారు. ఇవి నిర్వాహాలు. దీనికి ఉదాహరణంగా పెరియాళ్వార్లు తిరుమొళిలోని **"ఎమ్మనా! ఎన్ కులదైవమే! ఎన్నుడై నాయకనే!"** అనే మూడు సంబోధనల లోని అర్థస్వారస్యాలను శ్రీయామునులు, శ్రీరామానుజులు వేర్వేరుగా తెల్పిన రీతిని శ్రీమణవాళమహామునులు తమ వ్యాఖ్యలో ప్రస్తావించడం గమనించవచ్చు.

**3. వార్తలు :**

ఆళ్వార్ల సూక్తులకు ఆ యా సందర్భాలకు తగినట్లుగా ఆచార్యులు పల్కిన రసఘనాలైన వార్తలు (సూక్తులు) కూడా వ్యాఖ్యాతలచే ఉట్టంకింప బడ్డాయి. ఉదాహరణకు - తిరుప్పావై ప్రబంధానికి అర్థాన్ని వివరించమని శ్రీరామానుజులను ఒకరు ప్రార్థించగా "గడ్డాలు, మీసాలు మొలిచినవారు తిరుప్పావై అర్థాన్ని వినడానికి అనర్హులు.... పలుమాటలెందుకు? పదిమంది ఆళ్వార్ల సారభూత అయిన గోదాదేవియే పలకాలి, ఆమెయే వినాలి" అని రామానుజులు పల్కిన వార్తను గ్రహించవచ్చు.

**4. సంవాదాలు :**

ఆళ్ళ్వార్ల పాశురాల వివరణలలో అక్కడక్కడ ఏర్పడే సందేహాలను గూర్చి ఆచార్యుల మధ్య జరిగిన సంభాషణలు (సంవాదాలు) కూడా వ్యాఖ్యానాలలో ప్రస్తావింపబడ్డాయి. ఉదాహరణంగా పెరియతిరుమొ*ళి* (9-3-1)వ పాశుర వ్యాఖ్యలో కన్పించే నమ్బిళ్ళై, నంజీయర్‌ల మధ్య జరిగిన సంవాదాన్ని గ్రహించవచ్చు.

**5. ఉదాహరణాలు (దృష్టాంతాలు) :**

కొన్ని సందర్భాలలో ఆయా సూక్తులకు అనుగుణంగా ఆచార్యులనే ఉదాహరణంగా వ్యాఖ్యాతలు పల్కడం గమనించవచ్చు. తిరుప్పావై 12వ పాశురం లోని **"అనైత్తిల్లతారు మఱిన్దు"** అనే సందర్భాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై – **"ఎమ్బెరుమానార్ తిరువవతరిత్తాప్పోలే కాణుమ్, ఇప్పెణ్‌పిళ్ళైయుమ్"** (ఈ గోపిక కూడా శ్రీరామానుజులు అవతరించినట్లుగా ఉన్నది) అని గోపికకు శ్రీరామానుజులను ఉదాహరణంగా పల్కడం దీనికొక నిదర్శనం.

**6. ప్రమాణాలు :**

శ్రీయామునులు, శ్రీరామానుజులు, కూరేశులు మొదలైనవారు ఆ*ళ్వా*ర్ల శ్రీసూక్తులను ఆధారంగా చేసికొని సంస్కృతంలో స్తోత్రాదులను రచించారు. వ్యాఖ్యాతలు కొన్నిచోట్ల ఆ*ళ్వా*ర్ల పాశురాలకు వివరణలను పలికేటపుడు ఆ ఆచార్యుల గ్రంథాలనుండి అనుగుణమైన శ్లోకాలను ప్రమాణాలుగా ప్రస్తావించారు. ఈ విధంగా ప్రస్తావించేటపుడు కొన్ని సందర్భాలలో ఆయా ఆచార్యుల నామప్రస్తావన కన్పించడం లేదు. ఉదాహరణకు, అమలనాది పిరాన్‌లోని **"నీణ్డ అప్పెరియవాయకణ్‌కళ్"** అనే సూక్తిని వివరిస్తూ, నాయనార్ ఆసూక్తిలోని అర్థాన్ని అందంగా అనుసంధించే భట్టర్ శ్రీరంగరాజస్తవంలోని **"కృపయా పరయా"** (1-98) ఇత్యాది శ్లోకాన్ని ఉదాహరించడం గమనించవచ్చు. ఇక, శ్రుతి స్మృతీతిహాసకావ్యాదులనుండి, ఒక్కొక్కప్పుడు ద్రావిడ ప్రబంధాల నుండి, లక్షణ గ్రంథాల నుండి ఉట్టంకించిన ప్రమాణాలు అయితే అనేకం.

ఈ విధంగా పూర్వాచార్య వ్యాఖ్యలలో వ్యక్తమయే విశేషాలు పలు రీతులలో గోచరిస్తున్నాయి. ఈ ఐతిహ్యాదుల ప్రస్తావన ఫలంగా నాథ మునుల నుండి

నంజీయర్, నంబిళ్ళై శ్రీవరవరమునుల వరకు గల పలువురి ఆచార్యుల విశేషాలను తెలిసికొనడానికి వీలవుతున్నది. ఆనాటి చోళప్రభువులకు, సామంతులకు, మంత్రులకు, ఆస్థానపండితులకు చెందిన విశేషాలు కూడా ప్రామాణికంగా లభ్యమవుతున్నాయి. ఇంచుమించుగా అయిదు ఆఱు వందల సంవత్సరాల కాలానికి చెందిన చరిత్ర, ఆ కాలంలోని శ్రీవైష్ణవ మతాభివృద్ధి, వ్యాప్తి వీటివల్ల చక్కగా స్ఫుటపడుతున్నవి. రాతిశాసనాలవలె, తామ్ర శాసనాలవలె ఈ ఐతిహ్యాదులు కూడా ప్రాచీన చరిత్ర నిర్మాణానికి సహాయపడే ఎంతో ఆవశ్యకాలైన, ఆధారాలు అనడంలో సందేహం లేదు.

పలువురి ఆచార్యుల జీవిత చరిత్రలను గూర్చి పలు అపూర్వ విశేషాలు కూడా ఈ ఐతిహ్యాదుల ప్రస్తావన వల్ల లభిస్తున్నవి. ఉదాహరణకు దివ్యసూరిచరితం, గురుపరంపరాప్రభావం, యతిరాజ వైభవంవంటి ప్రాచీన సాంప్రదాయిక చరిత్ర గ్రంథాలలో శ్రీరంగ నాథుడనుగ్రహించిన పాయసాన్న ఫలంగా ఇద్దఱు కుమారులు కూరేశులకు జన్మించినట్లు మాత్రమే తెలుప బడింది. కాని, తిరువాశిరియ ప్రబంధవ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై ప్రస్తావించిన ఒక ఐతిహ్యంవల్ల అంతకుముందే కూరేశుల ధర్మపత్ని ఆణ్డాళ్‌కు ఒక మగశిశువు కల్గి, చనిపోయినట్లు తెలుస్తున్నది.

పరాశరభట్టర్ చాలా చిన్న వయస్సులోనే పరమపదించినట్లు సాంప్రదాయిక కథనం. కాని, భట్టర్ అనుగ్రహించిన వివరణలను కొన్నిటిని తాను సాక్షాత్తు విన్నట్లు నమ్పిళ్ళై పల్కిన వైనాలు, పెరియ తిరుమొ*ழி* (4-10-8), (5-5-1), పాశురాల వ్యాఖ్యలో పెరియ తిరుమడల్ (**"మన్నియ శేవడియై"-** అనేచోట) వ్యాఖ్యలో కన్పిస్తున్నందున భట్టర్ అంత తక్కువ వయస్సులోనే పరమపదించలేదని, సుమారు అఱువై సంవత్సరాలపాటు వారు జీవించి ఉండవచ్చునని తెలుస్తున్నది. ఇటువంటి విశేషాలు ఎన్నో కన్పిస్తాయి.

ఐతిహ్యాల, అర్థనిర్వాహాల సమన్వయంలో కొన్ని చిక్కులు కూడా గోచరిస్తాయి. భట్టర్ మిక్కిలి అభిమానించినవారెవరు? అని వారిని వారి చరమకాలంలో అడిగినవారికి **"అనన్దా*ழ*్వాన్"** అని బదులు పల్కినట్లు పెరియా*ழ*్వార్ తిరుమొ*ழி*

(4-4-1) పాశురవ్యాఖ్యలో కన్పిస్తుంది. కాని, తిరువిరుత్తమ్‌లోని 44వ పాశురానికి పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యలో **"తిరుమలైనంబి"** అని తెలుపబడింది. **"శిఱ్ఱక్కురుకు"** అనే సూక్తిని భట్టర్ పల్కినట్లు తిరుప్పావై 1వ పాశురవ్యాఖ్య మూవాయిర ప్పడిలో ఉన్నది. కాని, ఈ సూక్తిని కూరేశులు పల్కినట్లు ఆ పాశురానికికే నాయనార్ అనుగ్రహించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో కన్పిస్తున్నది. ఆచార్యులందఱు అర్థనిర్వాహంలో, ఐకకంఠ్యాన్ని కలవారు కనుక, ఒకరు పల్కిన సూక్తినే ఇంకొకరు కూడా పల్కి ఉండవచ్చునని ఇక్కడ సమాధానంగా భావించవలసి ఉన్నది. ఇటు వంటి క్లేశాలు కొన్ని ఉన్నా, ఈ ఈ ఐతిహ్య, అర్థనిర్వాహాలుదులు అపూర్వవిజ్ఞాన భాండాగారం అని అనడంలో ఏ సందేహం లేదు. ఈవిధంగానే నాచ్చియార్ తిరుమొழி-(11-6)వ పాశురంలో శ్రీరామానుజులు నామోట్టంకనం లేకుండా తెలుపబడిన ఐతిహ్యం వారికి చెందినదే అనే సంగతిని **"పత్తుడై"** అనే తిరువాయ్‌మొழி దశకం (1-3) ప్రవేశం ఈడువ్యాఖ్యలో గమనించ వచ్చు.

దివ్యప్రబంధవ్యాఖ్యానాలలోని పూర్వాచార్యులు చూపిన అర్థ నిర్వాహాల విషయంలో కొన్ని గమనించదగిన అంశాలున్నాయి. ఐతిహ్య నిర్వాహాలనుకూర్చి **మహావిద్వాన్ ఉ.వే. శ్రీమాన్ కాంచీప్రభ అణ్ణంగరాచార్యస్వామివారు "ఐతిహ్యరత్నమాల"** అనే అద్భుత గ్రంథాన్ని వెలయించారు. దీనిని అధారంగా చేసి **ఉ.వే.శ్రీమాన్ డా. ఎస్. వేంకటకృష్ణన్ స్వామి వారు (గీతాచార్యన్ పత్రికా సంపాదకులు) "వాழ்వుమ్ వాక్కుమ్"** అనే గ్రంథాన్ని రచించారు. ఇందులో చాలావరకు పూర్వాచార్యుల అర్థనిర్వాహాలు చోటు చేసికొన్నా, కొన్ని ఇంకా మిగిలి ఉన్నాయి. ప్రత్యేకించి వార్తామాలా, ఇయఱ్పాకు అప్పిళ్ళై అనుగ్రహించిన ఉరైలో కన్పించే కొన్ని అర్థనిర్వాహాలు ఈ గ్రంథంలో కన్పించవు. ఉదాహరణకు **"ఇరణ్డామ్ తిరువన్దాది"** 65వ పాశురానికి ఉరై (ప్రతిపదార్థరూపమైన వివరణం) అనుగ్రహిస్తూ అప్పిళ్ళై **"అఙ్గనన్ఱిక్కే" పుకలిడ మెన్గిఅదు - అవతారసమాప్తియిల్ పోయ్ పుక్కరుకుమ్ వైకుంఠత్తైయాయ్, అఙ్గే "శూழ்న్దిరున్దేత్తువర్" ఎన్గిఅపడియే అవర్కళ్ నడువే పుక్కిరున్దు ఏత్తి వాழ்వేణుమెన్నుమిదిలే అధ్యవసిత్తేన్- ఎన్నవుమామ్. ఇదు తిరుమలనంబి నిర్వాహమ్"** (ఆవిధంగా కాకుండా **"పుకలిడమ్"** అనే దానికి - అవతారసమాప్తికి పోయి చేరే వైకుంఠమనే అర్థాన్ని గ్రహించి,

అక్కడ ప్రదక్షిణం చేస్తూ కీర్తిస్తారు' – అనే పెరియాழ్వార్ల సూక్తి క్రమంలో నిత్యసూరుల మధ్యలో చేరి, పల్లాండు పాడి, ఉజ్జీవించాలి – అని నిశ్చయించుకొన్నాను – అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. ఇది తిరుమలనంబి నిర్వాహం) అని తిరుమలనంబి చూపిన అర్థ నిర్వాహాన్ని ఉట్టంకించారు. అయితే, ఇది ఇయఱ్పాకు పెరియవాచ్చాన్‌పిళ్ళై కృపజేసిన వ్యాఖ్యలో కన్పించడం లేదు. శ్రీమాన్ వేంకటకృష్ణన్ స్వామివారి గ్రంథంలో కూడా చోటు చేసికోలేదు. పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలో **"పుకలిడమ్"** అనే పదానికి సర్పగతితో శ్రీరంగంలో ప్రవేశించే సమయాన్ని ఎదురు చూస్తూ ఉండి" అనే అర్థం చూపబడింది. ఇక్కడ శ్రీరంగం అనేది అర్చాస్థలాలన్నిటికీ ఉపలక్షణంగా గ్రహించాలి. పెరియవాచ్చాన్‌పిళ్ళై చూపిన ఈ అర్థనిర్వాహం నమ్బెరుమాళ్ళ గమనంలోని వైలక్షణ్యాన్ని పురస్కరించుకొని చేయబడింది. కనుక, నమ్బెరుమాళ్ళపట్ల అత్యంతాభి నివేశాన్ని కల భట్టర్ చూపిన నిర్వాహమై ఉంటుంది – అని **శ్రీసుదర్శన పత్రికాధిపతి శ్రీమాన్ ఎన్.కృష్ణస్వామి అయ్యంగార్** అభిప్రాయపడ్డారు. ఈ విధంగా చూచినపుడు గ్రంథస్థంకాని అర్థనిర్వాహాలు ఇంకా చాలా ఉన్నాయని ఏర్పడుతున్నది. ఇంతేకాక, భగవద్విషయం ఈడువ్యాఖ్యలో కొన్నిచోట్ల **"తమిழన్ శొన్నాన్"** అని చూపబడిన అర్థాలు కూడా అటువంటి కోవలోకే వస్తాయి. (దీనిని బట్టి దివ్యప్రబంధాలకు పూర్వాచార్యుల వ్యాఖ్యలే కాక తమిళపండితుల వ్యాఖ్యలు కూడా కొన్ని వెలిసినట్లు తెలుస్తున్నది) ఈ విధంగా పెరియవాచ్చాన్‌పిళ్ళై అప్పిళ్ళై నిర్వాహాలలోని వైవిధ్యాన్ని ఇరణ్డామ్ తిరున్దాదిలోని 75వ పాశురవ్యాఖ్య మొదలైన చోట్ల కూడా గమనించవచ్చు. దీనినిబట్టి అర్థనిర్వాహాల విషయంలో సమగ్రమైన పరిశోధన ఇంకా జరుగవలసి ఉన్నదని తోస్తుంది.

ఈ సందర్భంలో ఇరణ్డామ్ తిరువన్దాదిలోని **"పెరుకు మదవేழమ్"** అనే 75వ పాశురంలో ప్రస్తావింపబడిన గజదంపతి వృత్తాంతం భగవద్రామానుజులు, వారి శిష్యులకు ఉపదేశం చేసిన వృత్తాంతానికి ప్రతీక – అని, దివ్యదంపతుల వేంకటాద్రి విహారానికి ప్రతీక – అని పరంపరాగతమైన నిర్వాహాలుండడం కూడా గమనించాలి. అయితే ఇవి గ్రంథస్థం అయినట్లు కన్పించవు.

ఇంతకుముందు ఇరణ్డామ్ తిరువన్దాది 68వ పాశురంలో ఉట్టం కింపబడిన తిరుమలనంబి నిర్వాహం పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానంలో ఉట్టంకింపబడలేదు. దీనికి కారణం కూడా తెలియలేదు. కొన్ని కొన్ని నిర్వాహాలు కొన్ని చోట్ల కర్ణపరంపరలోనే నిలచిపోయి, గ్రంథస్థంగా కాకపోయినా తరువాతి కాలంలో వాటిలో కొన్నిటిని పూర్వాచార్యులు గ్రంథస్థం చేసి ఉండవచ్చు.

దివ్యప్రబంధాలకు వ్యాఖ్యానాలు రచింపబడాలనే అభిప్రాయం ఆళవందార్ కాలంలోనే ఏర్పడినా అది రామానుజుల కాలంలోనే కార్యం రూపం దాల్చింది. తిరువాయ్‌మొ*ఝ్రి* ప్రబంధానికి తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ (కురుకేశుల) ద్వారా ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం రచించడంలో వారే కారణమయ్యారు. ఆ ప్రబంధానికి తగిన వ్యాఖ్యానం తప్పక అవతరించాలనే అభిప్రాయం శ్రీరామానుజులకు కల్గడానికి కారణంగా చెప్పబడే, కర్ణపరంపరగా వినబడే ఒక వృత్తాంతం ఉన్నది. ఒకనాడు శ్రీరామానుజులు శ్రీరంగంలో తిరువీథిలో సంచరిస్తూ ఉండగా ఒక పండితుడు తిరువాయ్‌మొ*ఝ్రి*లోని **"ఆడియాడి"** దశకంలోని మొదటి పాశురానికి ఈ విధంగా అపవ్యాఖ్యానం చేశాడట. ఆషాఢ మాసం వర్షాకాలం. వానలు ఎక్కువగా కురిసినందున మట్టి ఇల్లు కఱిగి కూలిపోయింది. అపుడు ఆ ఇంటిలోని గృహిణి శోకించే సందర్భాన్ని ఈ పాశురం తెల్పుతున్నదని అంటూ ఆ పాశురాన్ని ఆ పండితుడు **"ఆడి** – ఆడిమాసంలో, **అకమ్ కరైన్దు** – ఇల్లు కరగిపోగా, **ఆడి –** దుఃఖంతో అల్లలాడి, **ఇశై పాడి పాడి–** రోదించి, **కణ్ణీర్ మల్‌కి –** కన్నీరు నిండగా, **ఎఙ్గుమ్ నాడి నాడి –** నివాసంకోసం అంతా వెదకి వెదకి, **నరశిఙ్గా ఎన్దు –** ఓనరసింహస్వామీ!– అని, **ఆఱుదల్ –** ఈ గృహిణి, **వాడి వాడుమ్–** మిక్కిలి క్లేశపడుతున్నది" అని వ్యాఖ్యానించాడట. దీనిని విన్న శ్రీరామానుజులు "అయ్యో! ఆ*ఝ్వా*ర్ల పాశురాలకు ఈ విధంగా కూడా అపార్థాలు చెప్పేవారున్నారా? సరి అయిన వ్యాఖ్య అవతరించకపోతే ఇదే ఈ పాశురానికి నిజమైన భావమని లోకం తలుస్తుంది కదా! తప్పక తగిన వ్యాఖ్య ఆ*ఝ్వా*ర్ల ప్రబంధాలకు అవతరించాలి" అని తలచి, పిళ్ళాన్ తిరువాయ్‌మొ*ఝ్రి* ప్రబంధానికి వ్యాఖ్యానం రచించమని ప్రోత్సహించారట – అనేది ఒక దంత కథ.

కాని, ఈ ఐతిహ్యం అభూతకల్పనమే తప్ప దీనిలో ఏమాత్రం నిజంలేదని కాంచీ మహావిద్వాన్ అణ్ణంగరాచార్యస్వామివారు కొట్టివేశారు. ఈ ఐతిహ్యం నిజం కాకపోయినా, అతిగంభీరాలైన ఆ*ళ్వా*ర్ల ప్రబంధాలకు విస్తృతాలైన వ్యాఖ్యలు అవతరించాలనే దృఢమైన శ్రీరామానుజుల అభిప్రాయమే దివ్యప్రబంధవ్యాఖ్యానాల అవతరణకు మూలహేతువు– అనేది నిస్సంశయం.

దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలోని ఒకే సూక్తికి పలువురు ఆచార్యులు చూపిన పలు నిర్వాహాలు కన్పిస్తాయి. ఉదాహరణకు **"నణ్ణాదార్"** (4–9) అనే తిరువాయ్‌మొ*ళి* దశకంలో ఆ*ళ్వా*ర్లు అనుభవించే క్లేశం స్వరక్షణ కోసమని ఎమ్బార్ అర్థం నిర్వహించగా, పరదుఃఖాసహిష్ణుత్వంలో అగ్రేసరులైన కూరేశులు పరి రక్షణకోసమని అర్థనిర్వాహం చేశారు. ఇది అవతారికలో తెలుపబడింది. అయితే, ఈ దశకంలోని పాశురాలలో గల ఆ యా ప్రయోగాలకు కూడా వ్యాఖ్యాతలు ఈ రెండు నిర్వాహాలకు అనుగుణంగా వివరణలను చేశారు. రెండవ పాశురంలోని **"ఆమాఱొన్ఱఱి యేన్ నాన్"** (ఈ దుఃఖనివృత్తికి తగిన ఉపాయాన్ని ఏమీ నేను తెలియలేకున్నాను) అనే సూక్తిని ముందుగా ఎమ్బార్ చేసిన నిర్వాహానికి తగినట్లు **"ఇన్నత్తుక్కు నాన్ కూప్పిడ ప్పుకుకిఱేన్ ఎన్ఱఱియానిన్ఱేనో!"** (ఈ ప్రయోజనం కోసంగా నేను అర్థిస్తున్నానని నేను తెలిసికొన్నానా?) అని వివరించి, వెంటనే కూరేశనిర్వాహానుగుణంగా **"సంసారికళుడైయ ఇన్ద దుఃఖనివృత్తిక్కు విరకేదో– ఎన్ఱఱికిలేన్– ఎన్నుదల్"** (సంసారుల ఈ దుఃఖం తీరడానికి ఏది ఉపాయం – అనే దానిని నేను తెలియను– అని కూడా చెప్పవచ్చు) అని వ్యాఖ్యానించారు. ఇందువల్ల, ఆ రెండు నిర్వాహక్రమాలను అనుగుణంగా వ్యాఖ్యాతలు వివరించినపుడు ఆయా నిర్వాహాలను చేసిన ఆచార్యుల నామాలను ఉట్టంకించక పోయినా, అర్థనిర్వాహంలోని తేడాను బట్టి వాటిని ఆయా ఆచార్యుల నిర్వాహాలుగా భావించవలసి ఉన్నది. ఇటువంటి క్రమం పలు దశకాల వ్యాఖ్యలలో కన్పిస్తుంది. దీనిని అరుంబద కారులు అక్కడక్కడ సూచించారు కదా.

అర్థనిర్వాహాల విషయంలో ఇంకొక అద్భుతమైన అంశాన్ని కూడా ఇక్కడ ప్రస్తావించాలి. తిరువాయ్‌మొ*ళి*లోని మొదటి పాశురలోని **"తుయరఱు శుడరడి"** అనే సూక్తికి ఆళవందార్ భక్తుల దుఃఖాన్ని తీర్చే వికస్వర శ్రీచరణాలు" అని,

"భగవానుని క్లేశాన్ని తీర్చే వికస్వరమైన శ్రీచరణాలు" అని రామానుజులు అర్థాలను నిర్వహించారు. ఈ అర్థనిర్వాహాలను ఈ దశకంలోనే కాక, ప్రబంధంలోని చివరి పాశురంలో కూడా అన్వయిస్తూ వ్యాఖ్యానింపబడడం గమనించాలి. ప్రబంధంలోని చివరి పాశురంలోని **"ఎన్ అవా అఱ చ్చూழ்న్దాయ్"** అనే ప్రయోగాన్ని **"నంబిళ్ళై ఎన్నుడైయ విడాయ్ ఎల్లామ్ తీర వన్దు ఎన్నోడే కలన్దాయ్"** (నా ఆర్తి అంతా తీరేటట్లుగా వచ్చి నాతో సంశ్లేషించావు) అని ఆళవందార్ అర్థనిర్వాహాను గుణంగా వివరించి, వెంటనే, **"ఎన్నోడే కలన్ద ఉన్నుడైయ విడాయుమ్ ఒరు పడి కెట్టదే – ఎన్గిఱారాకవుమామ్"** (నాతో సంశ్లేషించిన నీ ఆర్తికూడా ఒక విధంగా తీరింది కదా – అని అంటున్నారని చెప్పవచ్చు) అని శ్రీరామానుజ నిర్వాహానుసారంగా కూడా వివరించారు. ఈ విషయాన్ని జీయర్ అరుంబదం **"ఇన్ద ఇరణ్డు యోజనైయుమ్ 'తుయరఱు శుదరడి' ఎన్టు ఉపక్రమత్తిలే అరుళిచ్చెయ్దత్తై ఉపసంహరిక్కిఱార్ – ఎన్నుమిడమ్ తోన్ఱుకిఱదు"** (ఈ రెండు అర్థయోజనలతో– **"తుయ రఱుశుదరడి"** అని ఆరంభంలో తెల్పిన దానిని ఉపసంహరిస్తున్నారు– అనే విషయం స్ఫురిస్తున్నది) అని సూచించింది. ఇక్కడ నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలో ఉదాహరించిన **"అంకే భరతమారోప్య ముదితః పరిషస్వజే"** (ఒడిలో భరతుని కూర్చుండబెట్టుకొని ఆనందించినవాడై ఆలింగనం చేసికొన్నాడు) అనే శ్రీరామాయణ సూక్తి ఈ రెండు అర్థనిర్వాహాలకు సమన్వయిస్తుందని రెండు అరుంబదాలలోను తెలుప బడింది. **"తమ్ముడైయ అభినివేశమ్ కెడ వన్దు కలన్దదుక్కుమ్, తన్నభినివేశమ్ కెడ వన్దు కలన్దదుక్కుమ్ పొదువాయ్త్తివ్వుదా హరణమ్"** (తమ (ఆழ்వార్ల) అభినివేశం తీరేటట్లు వచ్చి సంశ్లేషించినదానికి, తన (భగవానుని) అభినివేశం తీరేటట్లు వచ్చి సంశ్లేషించినదానికి ఈ ఉదాహరణం పొసగుతుంది) అని అడైయవళైన్దాన్ అరుంబదం తెల్పింది. దీనినిబట్టి శ్రీరామానుజుల నిర్వాహం కూడా శ్రీరామాయణ సూక్త్యను గుణమని స్పష్టమవుతున్నది. **"ముదితః"** అనే శ్లోకంలోని ప్రయోగం భగవానుని ఆర్తి తీరడాన్ని సూచిస్తుంది. కాని, భరతుని ఆర్తి తీరడం అయితే అర్థతః సిద్ధం. **"రమమాణా వనే త్రయః"** అని కదా శ్రీరామాయణ సూక్తి. కాని, ఆழ்వార్ల సూక్తిలో వారి ఆర్తి తీరడం శబ్దతః స్పష్టం, భగవానుని ఆర్తి అర్థతః స్ఫురిస్తున్నది.

ఈ విధంగా పూర్వాచార్యులు చేసిన అర్థనిర్వాహాలన్నీ ఉభయ వేదాంత సంప్రదాయాన్ని, సమన్వయాన్ని అభివృద్ధి చేశాయి. శ్రీరామానుజులనుండి శ్రీవర వరమునులవరకు గల పూర్వాచార్యులు శ్రీరంగంలో నిత్యనివాసాన్ని ఏర్పరచు కొని, నిత్యం ఆళ్వార్ల సూక్తులలోని మధురమైన అర్థాలను, సమన్వయాలను చంద్రపుష్కరిణి సమీపంలోని పొన్నచెట్టు కింద కూర్చుని అనుసంధించు కొనేవారట. ఈ విషయాన్ని భట్టరు **"పున్నాగ తల్లజమజస్ర సహస్రగీతిసేకోత్థ దివ్యనిజ సౌరభమ్"** (ఎల్లప్పుడు తిరువాయ్‌మొళ్ళి పాశురసారంచేత తడుపబడినందున ఏర్పడిన దివ్యపరిమళాన్ని కల్గినది, ఈ గొప్ప పొన్నచెట్టు) అని అన్నారు. వేదోపబృంహణాలలోని సూక్తులకు, ఆళ్వార్ల దివ్యప్రబంధాల లోని ప్రయోగాలకు మధ్యగల మధురార్థ సంవాదాలను మన పూర్వాచార్యులు గమనించి వెలువరించినట్లుగా ఏ సాహిత్యంలోను ఎవరూ చేయలేదు. ఇటువంటి ప్రక్రియ గాని, ఇంతటి సద్విమర్శగాని, అర్థనిర్వాహాలు కాని చేయబడలేదనేది వాస్తవం. ఇంతటి పుష్కలమైన, మధురమైన, ప్రామాణికమైన, ఉభయవేదాంత సమన్వయాత్మకమైన, విమర్శనాత్మకమైన సాహిత్యం ఏ సంప్రదాయంలోను కన్పించకపోవడం మనకు సాత్త్విక గర్వకారణం. ఇంతటి అర్థపౌష్కల్యానికి కారణభూతులు శ్రీరామానుజులే – అనే సంగతిని భట్టర్ **"తమిళ్ళ్‌మఱైకళ్ ఆయిరముమ్... మెయ్‌మ్మాల్ వళర్త్త ఇదత్తాయిరామానుశన్"** అనేసూక్తిద్వారా స్పష్టం చేశారు. ఎమ్బార్‌కూడా – **"ఎజ్గళ్ కదియే! ఇరామానుశమునియే శజ్కై కెదుత్తాణ్డ తవరాశా! పొజ్గు పుకళ్ళ్ మజ్గైయర్‌కోన్ ఈన్ద మఱై ఆయిర మనైత్తుమ్ తజ్గు మనమ్ నీ ఎనక్కు తా"** (మాకు గతి అయిన శ్రీరామానుజ మునీ! మా సందేహాలను తీర్చి కాపాడే యతిరాజా! గొప్ప కీర్తిని కల తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన వేయి పాశురాలను పూర్తిగా ధరించే మనస్సును నాకు అనుగ్రహించండి) అని అంటూ శ్రీరామానుజుల కృపవల్లనే ఆళ్వార్ల సాహిత్యాన్ని మనస్సులో ధరించడం సాధ్యమవుతుందని అన్నారు.

శ్రీరామానుజులు తిరుమాలైఆండాన్ సన్నిధిలో తిరువాయ్‌మొళ్ళి ప్రబంధార్థాన్ని అధికరించేటప్పుడు కొన్ని సందర్భాలలో ఆండాన్ తెల్పిన అర్థ నిర్వాహాలకంటే వేరైన, సరసమైన నిర్వాహాలను ప్రస్తుతించిన విషయాన్ని

సంప్రదాయ చరిత్ర గ్రంథాలు ప్రస్తుతించాయి. వడుగనంబి రచించిన యతిరాజ వైభవంలో **"ఏవంవిధోర్థోప్యుచితోభవేదిత్యుక్తం క్వచిత్ తత్ర యతీశ్వరేణ, శ్రుత్వా గురుః పూర్ణయుగాయ చాహ తాభ్యాం చ తేనాప్యభి నందిత స్సః"** అని, ప్రపన్నామృతంలో **"గాథాయాః తత్ర కస్యాశ్చిత్ అర్థం శ్రుత్వా గురూత్తమాత్, తస్యా ఏవ స గాథాయాః ప్రోవాచార్థం తతోపరమ్, ఉపకారస్మృతి యుతం విశేషార్థం యతీశ్వరః"** అని, రామానుజ చరిత్రను తెలిపే సకలజన సంజీవనం అనే తెలుగు కావ్యంలో **"తత్తదర్థానుసంధాన దత్తచిత్తుడగుచు యతివర్యుడాచార్యు డానతిచ్చునంత కెచ్చుగ యోజించి యాడ నాడ"** అని, వడివ*ళ్ళ*గియనమ్బిదాసర్ రచించిన రామానుజ వైభవం అనే ద్రావిడభాషలోని గ్రంథంలో **"అజ్గదు కేట్టు ఉడైయవరుమ్ అదిల్ మున్నుమ్ పిన్ను ముళ్ ఓజ్గుఙు శీర్ప్పనువలుఙుమ్ ఉరై యెల్లామ్ కేట్టరుళి ఈజ్గిదనుక్కు ఇవ్వణ్ణమ్ ఆనాలో? ఎన ఇశైత్తార్ తాజ్గుమరుళ్ తిరుమాలై ఆణ్డాను శా*ద్ర*గ్రెన్హాన్"** (అక్కడ ఆ పాశురానికి అర్థాన్ని ఆలకించిన రామానుజులు "ఈ పాశురానికి ముందు వెనుకలలో ఉండే గొప్ప పాశురాల అర్థాన్ని అంతటిని గమనిస్తే ఇక్కడ ఈ పాశురానికి ఈ విధంగా అర్థం పలకడం బాగుంటుంది కదా! అని అన్నారు. కృపనుకల ఆండాన్ కూడా "ఆ అర్థాన్ని పల్కు" అన్ని అన్నారు) అని తెలుపబడింది.

శ్రీరామానుజులు ఈవిధంగా నూతనమైన సమన్వయాలను చేయడం దీనికి ముందే ప్రారంభమైన సందర్భంకూడా ఇక్కడ స్మరణీయం. యాదవ ప్రకాశులవద్ద వేదాంత విద్యను అభ్యసించేటప్పుడు కప్యాసశ్రుతికి అర్థం ఆయన తెలిపిన అర్థాన్ని కాదని వేఱొక చక్కని సమన్వయాన్ని చేసిన సందర్భం ఉదాహరణగా గమనించ వచ్చు. ఆవిధంగానే శ్రీరామానుజులు చూపిన అందమైన, అపూర్వమైన పలు నిర్వాహాలు తిరువాయ్మొ*ళ్ళి* ప్రబంధ వ్యాఖ్యానాలోనే కాక, మిగిలిన ఆ*ళ్ళా*ర్ల ప్రబంధాల వ్యాఖ్యానాల్లో కూడా గోచరిస్తాయి. ఇంతేకాదు, పెరియా*ళ్ళా*ర్ తిరుమొ*ళ్ళి*లోని **"అమ్మనే అప్పూచ్చి కాట్టుకిన్హాన్"** అనే సూక్తికి అరయర్ చేసిన అభినయ ప్రక్రియను కాదని వేరొక సరసమైన అభినయాన్ని ఎమ్బార్ తెలిపిన సందర్భంలో ఎమ్బార్ చూపిన అభినయాన్ని రామానుజులు ప్రశంసించడం కూడా ఇక్కడ వారి నిర్మాణాత్మకమైన, నిశితమైన, సరసమైన దృష్టికి ఉదాహరణగా

స్మరించవచ్చు. ఈవిధంగా శ్రీరామానుజులు ఆழ்వార్ల సూక్తులకు చేసిన, చూపిన సమన్వయాలు అత్యంత మధురాలు, ప్రామాణికాలు కూడా.

పలువురు పూర్వాచార్యులు చూపిన అర్థనిర్వాహాలను, పూర్వా చార్యులకు సంబంధించిన ఐతిహ్యాలను, వారు ఆయా సందర్భాలలో పల్కిన వార్తలను, ఆచార్యులకు మధ్య వివిధ విషయాలను గూర్చి జరిగిన సంభాషణరూప సంవాదాలను ఉట్టంకిస్తూ సాహిత్యాన్ని వ్యాఖ్యానించే ప్రక్రియ వేఱు ఏ భాషలోను, ఏ సంప్రదాయంలోను కన్పించదు. ఈ విధంగా వీటిని ప్రస్తావించడం వల్ల భవిష్యత్ తరాలవారికి పలు విధాలైన సందేశాలను, ఇచ్చినట్లయినది. మార్గాలను చూపినట్లయినది. సాహిత్యాన్ని ఏ దృష్టిలో ఏవిధంగా, ఎంత నిశితంగా అధ్యయనం చేయవచ్చుననే విషయాన్ని దీనివల్ల తెలియవచ్చు. పలువురు ఆచార్యులకు సంబంధించిన వైయక్తికమైన విశేషాలు. ఐతిహ్యావార్త సంవాదాలలో చోటు చేసికోవడం వల్ల కూడా వారి కాలం, చరిత్ర మొదలైనవానిని తెలిసికొనే అవకాశం కల్గింది. ఈ విధంగా ఐతిహ్య నిర్వాహాదులు సాహిత్య దృష్టిలోనే కాక చారిత్రక దృష్టిలో కూడా చాలా ప్రాధాన్యాన్ని కల్గినవి.

శ్రీరామానుజుల నిర్వాహాదుల గూర్చి విన్నపించాలనే ఈ ప్రయత్నాన్ని సుమారు మూడు సంవత్సరాల క్రితమే ఆరంభించినా, మధ్యలో అనుకోకుండా ఏర్పడిన పలు ఆటంకాల వల్ల ఇంత ఆలస్యమైనది. నన్నీ వాచిక కైంకర్యంలో మాటి మాటికి ప్రోత్సహించిన సహృదయమిత్రం ఉ.వే. శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్య స్వామివారికి అనేక కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. భగవత్కృపవల్ల, శ్రీరామానుజానుగ్రహం వల్ల ఇప్పటికి ఏతావన్మాత్రమైనా విన్నవించగల్గినందుకు సంతోషంగా ఉన్నది. ఈ గ్రంథంలో నా అజ్ఞానాదుల వల్ల చోటుచేసికొన్న స్ఖాలిత్యాలను మన్నించమని సహృదయ పాఠకులను కోరుతున్నాను. తిరువాయ్‌మొழி ప్రబంధంలోని 3వ శతకంలో కైంకర్య ప్రార్థనను తెలిపే ద్వయమంత్రోత్తర ఖండానికి వివరణాత్మకమైన **"ఒழிవిల్ కాలమెల్లామ్"** అనే (3-3) దశకం వరకు గల ఐతిహ్యాదులు ప్రకృత గ్రంథంలో కూర్చబడ్డాయి. ఇది మొదటి భాగం. రెండవ భాగంలో మిగిలిన

నిర్వాహాదులు వివరింపబడతాయి. ఈ గ్రంథాన్ని అవలోకించి మంగళా శాసనాలను అందించిన సహృదయులు శాస్త్రరత్నాకర, మహామహోపాధ్యాయ, ఉ.వే. శ్రీమాన్ డా. ఎన్.వి.రంగరామానుజాచార్య స్వామివారి సన్నిధిలో, భాగవతా మృతవర్షి, ఉ.వే. సాతులూరు గోపాలకృష్ణమాచార్య స్వామివారి సన్నిధిలో, ఉ.వే. శ్రీమాన్ డా. అద్దంకి శ్రీనివాస్‌స్వామివారి సన్నిధిలో కర్తజ్ఞ్య పురస్సరంగా దాసోహ సమర్పణను చేసికొంటున్నాను. శ్రీమాన్ అయోధ్య స్వామి వారి తిరు నక్షత్రోత్సవ సందర్భంలో ఈ గ్రంథం వెలువడడం నా అదృష్టంగా భావిస్తున్నాను. స్వస్తి.

**శఠకోపసహస్రస్య సామవేదస్వరూపిణః ।**
**వ్యాఖ్యా బహువిధాః ప్రోక్తాః పూర్వాచార్యైః దయాళుభిః ॥**

**భగవద్విషయాభిఖ్యవ్యాఖ్యాస్వేతాసు దర్శితాః ।**
**దృష్టాంతైతిహ్యవార్తాశ్చ యతీంద్రవిషయాత్మికాః ॥**

**తథాచారుంబదాఖ్యానవ్యాఖ్యాసు విశదీకృతాః ।**
**అవధేయరహస్యోక్తీః మధురార్థపరంపరాః ॥**

**క్రమేణ తాస్సముద్ధృత్య వ్యాకరోతి యథామతి ।**
**దాసః శ్రీశింగరార్యోసౌ రామానుజసిసేవిషుః ॥**

**అముత్ర  విహితా దోషాః మదజ్ఞానప్రమాదతః ।**
**క్షంతు మర్హంతి తాన్ సంతః క్షమావాత్సల్యశాలినః ॥**

**వాచికీ వరివస్యేయమర్పితా భక్తిపూర్వకమ్ ।**
**ప్రీణయేత్ శ్రీయతీశానం దయావాత్సల్యవారిధిమ్ ॥**

**వాధూలశ్రీనృసింహార్యజన్మర్క్షమహచిహ్నికా ।**
**సేయం ప్రకల్పతాం ప్రీత్యై తత్పదాబ్జనిషేవిణామ్ ॥**

భాగవత విధేయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**



శ్రీమతే రామానుజాయ నమః

# తిరువాయ్‌మొழி వ్యాఖ్యానాలలో - ఎమ్బెరుమానార్ నిర్వాహాలు, వార్తలు, ఐతిహ్యాలు

## ప్రథమ భాగం

## భగవానుని క్లేశాన్ని కూడా తీర్చే శ్రీచరణాలు

### 1) 1-1-1 - ఈడు వ్యాఖ్యానమ్

**(తుయరఱు) "తుయర్ అఱుక్కుమ్" ఎన్ఱు మున్బుళ్ళ ముదలికళ్ "అరుళిచ్చెయ్యుమ్బడి.... తుయర్ అఱుమ్ శుదరడి" ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి"**

**(తుయరఱు)**-భక్తుల క్లేశాన్ని తీర్చే స్వభావాన్ని కల- అని శ్రీరామానుజులకు ముందున్న పూర్వాచార్యులు పలికారు. తన క్లేశాన్ని కూడా తీర్చే స్వభావాన్ని కల వికస్వర తేజోరూపమైన శ్రీచరణాలు - అని శ్రీరామానుజులు పలికారు.

తిరువాయ్ మొழி ప్రబంధం మొట్టమొదటి పాశురంలో నమ్మాழ்వార్ భగవంతుని శ్రీచరణాలను **"తుయరఱు శుదరడి"** అని కీర్తించారు. ఈ సూక్తికి, శ్రీరామానుజులకు ముందున్న పూర్వాచార్యులు చేసిన అర్థనిర్వాహాన్ని, శ్రీరామానుజులు చూపిన ఇంకొక అద్భుతనిర్వాహాన్ని నమ్బిళ్ళై తమ ఈడువ్యాఖ్యలో పైవిధంగా ప్రస్తావించారు.

"భక్తుల క్లేశాలను తీర్చే ప్రకాశించే శ్రీచరణాలు" - అని ఈ ప్రయోగానికి పూర్వాచార్యులు అర్థ నిర్వాహాన్ని చేశారు. కాని, శ్రీరామానుజులు "భక్తుల కష్టాలను తీర్చడం ద్వారా తన దుఃఖాన్ని తీర్చుకొనే, ప్రకాశ స్వభావం కల శ్రీచరణాలు"

అని వేఱొక అర్థాన్ని వివరించారు. అంటే – ఆழ்వార్ల దుఃఖాలకు కారణమైన అజ్ఞానాన్ని తీర్చి, తద్వారా భగవంతుడు తన దుఃఖనివారణను పొందుతున్నాడని దీని భావం.

ఈ రెండు విధాలైన అర్థనిర్వాహాలలోని సామంజస్యాన్ని గమనిస్తే కొన్ని మధురమైన అంశాలు గోచరిస్తాయి. పూర్వుల అర్థనిర్వాహం – భగవంతుని హేయప్రతిభటత్వంపై ఆధారపడింది. శ్రుతి **"విజరః విమృత్యు ర్విశోకః"** (ముసలితనం లేనివాడు, మృత్యువు లేనివాడు, శోకం లేనివాడు) ఇత్యాదిగా పరమాత్మ శోకవిదూరుడని అన్నది. **"తుయరఱు"** అనే ప్రయోగానికి "తన దుఃఖాన్ని తీర్చుకొనే" అనే అర్థాన్ని గ్రహిస్తే, భగవానునకు కూడా ఒక క్లేశం ఉన్నది – అని, దానిని ఆ స్వామి శ్రీచరణాలు తీరుస్తున్నవి – అనే భావం స్ఫురిస్తుంది. ఇది, పూర్వం ప్రస్తుతించిన, భగవంతుడు దోషవిదూరుడనే శ్రుతికి విరుద్ధం కాగలదు. అందువల్ల, పూర్వులు **"తుయరఱు"** అనే ప్రయోగానికి "భక్తుల క్లేశాలను తొలగించే" అనే అర్థాన్ని గ్రహించారు. ఈ అంశాన్ని అడైయ వళైన్దాన్ అరుంబద కారులు **"హేయప్రత్యనీకమాన వస్తువుక్కు తుయరుణ్డాయిల్లై– ఎన్ఱు శొల్లవేణ్డుమ్. ఆకైయాలే ఆశ్రితరుడైయ తుయర్ అఱుక్కు మెన్ఱు ముదలికళుక్కు క్కరుత్తు"** (హేయప్రత్యనీకుడైన భగవంతునకు క్లేశం లేదని చెప్పాలి. కనుక, "ఆశ్రితుల క్లేశాలను తీర్చే" – అని పూర్వుల భావం) అని తెలిపారు. ఈ అర్థ నిర్వాహం భగవంతుని పరత్వానుగుణం.

ఇక, భగవద్రామానుజులు చూసిన అర్థనిర్వాహంలోని విశేషం గమనించాలి. శ్రీరామానుజుల నిర్వాహాన్ని అరుంబదకారులు– **"ఎమ్బెరుమానార్ నిర్వాహత్తిలే– తుయరఱు – ఎన్గతుక్కు – తన్ తుయర్ అఱుమ్ – ఎన్గపడి. ఆశ్రితరుడైయ తుయరడియాక త్తనక్కు త్తుయరుణ్డాకైయాలే, అవర్‌కళ్ తుయర్ తీర్‌న్దాల్ తనక్కు దుఃఖనివృత్తి యుణ్డాకైయుమ్ గుణమామిత్తనై – ఎన్ఱు ఎమ్బెరుమానార్‌నిర్వాహమ్"** (శ్రీరామానుజుల నిర్వాహంలో – **"తుయరఱు"** అనే ప్రయోగానికి – తన క్లేశం తీర్చే – అని అర్థం. భక్తుల క్లేశం మూలంగా తనకు క్లేశం కల్గుతుంది కనుక, వారి క్లేశం తీరితే తనకు క్లేశనివృత్తి కల్గడం కూడా గుణమే"– అని శ్రీరామానుజుల అర్థనిర్వాహం) అని విశదం చేశారు.

అయితే, తనకు సహజంగా ఏ శోకం లేకపోయినా, ఇతరుల దుఃఖాన్ని చూచి క్లేశపడడం కూడా హేయగుణమే కదా! – అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. దీనిని నమ్పిళ్ళై వేదోపబృంహణమైన శ్రీరామాయణంలోని **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (మానవుల దుఃఖాలను చూచి శ్రీరాముడు తానుకూడా వారికంటే కూడా ఎక్కువగా బాధపడతాడు) అనే ప్రమాణాన్ని ఉదాహరిస్తూ చక్కగా సమాధానించారు. ఈ ప్రమాణం అయోధ్యాపురవాసులు శ్రీరాముని కల్యాణ గుణాలను కీర్తించే సందర్భంలోనిది. కనుక, నిశ్చయంగా ఇది కల్యాణ గుణప్రతిపాదకప్రమాణమే. ఒకడు ఇతరుల దుఃఖాన్ని చూచి బాధపడడం కృపాకార్యమే కాని, అది కర్మకృతమైనది కాదు కనుక హేయం కాబోదు. అంతేకాక, ఈ కృపామూలకమైన క్లేశం చిరకాలం అనువర్తిస్తుంది – అనే విషయాన్ని శ్లోకం లోని **"భవతి"** అనే వర్తమానకాలిక క్రియాప్రయోగం ద్వారా మహర్షి సూచించారు. ద్రౌపదికి మాన సంరక్షణ చేసి, తరువాత, ఆమె భర్తలకు రాజ్యాన్ని సంపాదించి ఇచ్చి, ఆమె కేశాలను ముడివేయించి – ఈ రీతిగా ఎన్నో విధాలైన రక్షణలను చేసినా, ఆమెకు కష్టం కల్గిన సమయంలో తాను ఆమె చెంతనే ఉండి, ఆమె కన్నీళ్ళు తుడవలేక పోయాననే బాధ శ్రీకృష్ణుని చివరి వరకు వెంటాడిందనే సంగతిని **"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్, ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి"** (దూరంలో ఉండే నన్ను ఉద్దేశించి గోవిందా! – అని ద్రౌపది చేసిన ఆక్రందన, చక్రవడ్డితో పెరిగిన అప్పువలె, నా హృదయంనుండి ఈనాటికీ తొలగిపోవడం లేదు) అని, **"నాతిస్వస్థమనా యయౌ"** (కలత చెందిన మనస్సుతోనే శ్రీకృష్ణుడు పరమపదానికి వెళ్ళాడు) అని గల ప్రమాణాలు తెల్పుతున్నాయి. కర్మకృతక్లేశమైతే సోపాధికం కనుక, ఉపాధి తొలగితే, తత్కార్యమైన క్లేశం కూడా వెంటనే తొలగిపోతుంది. ఇది కృపామూలకం కనుక, కృప నిరుపాధికం కనుక, తన్మూలంగా కలిగే క్లేశం కూడా చిరకాలం అనువర్తించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఏతావతా ఏమి సిద్ధించినది? అంటే, మానవుల క్లేశం వలె భగవానునకు కలిగే క్లేశం హేయం కాదు, అందువల్ల ఇది కల్యాణగుణమే – అని. ఈ నిర్వాహం భగవంతుని కృపానుగుణం.

ఇప్పుడు మళ్ళీ ఇంకొక సందేహం కలుగవచ్చు. ప్రస్తుతంలో భక్తులైన ఆழ்వార్లకు కల్గిన క్లేశమేమి? దానిని భగవచ్చరణాలు ఏవిధంగా తీర్చాయి? అనేది

ఆ సందేహం. దీనికి సమాధానం ఆழ்వార్ల పాశురంలోనే ఇమిడి ఉంది. **"ఉయర్వఱ"** అనే పాశురాన్ని అన్వయించే క్రమాన్ని పూర్వాచార్యులు రెండు విధాలుగా చూపారు. నాల్గు పాదాలను కలిపి ఏకవాక్యంగా అన్వయించే క్రమం ఒకటి. మొదటి మూడు పాదాలలో ఒక్కొక్క పాదాన్ని నాల్గవ పాదంతో కలిపి అన్వయించే క్రమం ఇంకొకటి. ప్రస్తుతంలో రెండవ క్రమం అపేక్షితం. ఇక్కడ **"మయర్వఱ మదినల మరుళినన్ యవనన్, అవన్"** అనే రెండవ పాదాన్ని **"తుయరఱు శుడరడి తొழுదు ఎన్ మననే!"** (ఓ మనసా! అజ్ఞానం తీరేటట్లుగా భక్తిరూపాపన్నజ్ఞానాన్ని అనుగ్రహించిన వాడెవడో, ఆ పరమాత్మయొక్క, దుఃఖాలు తొలగించే స్వభావాన్ని కల, అందువల్ల ప్రకాశించే శ్రీపాదాలను నమస్కరించు) అని చివరి పాదంతో అన్వయించి అర్థాన్ని గ్రహించాలి. ఇపుడు ఈ అన్వయాన్నిబట్టి – ఆழ்వార్లకు అజ్ఞానాదుల వల్ల క్లేశం ఏర్పడగా, ఆ అజ్ఞానాన్ని తీర్చడం ద్వారా పరమాత్మ శ్రీచరణాలు ఆழ்వార్ల క్లేశాన్ని తీర్చాయి – అని అర్థం. ఇక్కడ **"మయర్వు"** (అజ్ఞానం) అనే కారణం ద్వారా కార్యమైన క్లేశం సూచింపబడింది. అంటే – ఇది కార్యే కారణోపచార ప్రయోగం. ఈ విధంగా ఆழ்వార్ల దుఃఖాన్ని భగవానుని శ్రీచరణాలు తీర్చినందున, గతంలో ఆழ்వార్ల దుఃఖాన్ని చూచి మిక్కిలి క్లేశ పడిన పరమాత్మకుకూడా ఆ క్లేశం తీరింది. కనుక, **"ఇవన్ తుయరఱ త్తాన్ తుయర్ తీర్న్దానాయిరుక్కై"** (జీవుని దుఃఖం తీరగా, భగవానుడు తన దుఃఖం కూడా తీరిన వాడయ్యాడు) అనే ఈడు వివరణం సార్థకం; సహృదయ మనోహరం.

శ్రీరామానుజులు వేదార్థసంగ్రహశ్రీభాష్యాదిగ్రంథాలలో శ్రుత్యర్థ నిర్వాహాలను చేసేటపుడు తత్తత్ ప్రకరణానుగుణంగా ఆ అర్థనిర్వాహాలను చేశారని విజ్ఞులైన మన పూర్వాచార్యుల వివరణం. ప్రకృతంలోకూడా శ్రీరామానుజుల ఈ అర్థ నిర్వాహం భగవానుని నిరుపాధికకృపను సూచించే పాశురంలోని రెండవ పాదాన్ని అనుసరించి చేయబడిందనే విషయం సుస్పష్టం. ఈవిధమైన శ్రీరామానుజుల అతిగంభీరాలైన అర్థనిర్వాహాలు, శ్రీరామానుజులకు ద్రావిడ ప్రబంధాలలో, ద్రావిడ భాషలో పరిచయం లేదని అతివాదం చేసేవారిని నిరుత్తరులను చేసే అందమైన సమాధానాలు.

ఇక, చివరగా, శ్రీరామానుజులు చూపిన ఈ అద్భుతార్థ నిర్వాహంలోని ఇంకొక రస్యార్థాన్నికూడా సంగ్రహంగా ప్రస్తావించడం ఉచితం. ఉత్తమ ప్రబంధా

లలో ప్రధానప్రతిపాద్యార్థంయొక్క ఐక్యం ఆద్యంతాలలో సూచింప బడుతుంది. శ్రీరామానుజులు చూపిన ఈ అర్థనిర్వాహం తిరువాయ్‌మొ*ழி* ప్రబంధంలో కూడా ఆద్యంతాలలో ప్రధాన ప్రతిపాద్యార్థంయొక్క ఐక్యం సూచింపబడిందనే అంశాన్ని సూచిస్తున్నది. తిరువాయ్‌మొ*ழி*లోని ఆ ప్రధాన ప్రతిపాద్యార్థం ఏమి? అంటే – **"చేతనలాభం ఈశ్వరునిదే"** అనేదే.

ఆ అర్థం మొదటి పాశురంలో **"తుయరఱు శుదరడి"** అనే ప్రయోగంలో సూచింపబడింది. ఆశ్రితుల దుఃఖాన్ని తీర్చడంద్వారా, వారి దుఃఖంవల్ల తనకు కల్గిన దుఃఖాన్ని పరమాత్మ తీర్చుకొన్నవాడయ్యాడు – అనే ప్రకృతార్థంలోని తాత్పర్యం. ఇదే కదా. భగవద్రామానుజ సిద్ధాంతం. జీవాత్మ – పరమాత్మల మధ్య గల శరీర – శరీరిభావంపై ఆధారపడింది. ఇదే కదా విశిష్టాద్వైత సిద్ధాంత ప్రధానప్రతి తంత్రార్థం. తన ఇంటికి కల్గిన లోపాన్ని తీర్చిదిద్దుకుంటే ఆనందపడేవాడు ఆ ఇంటి యజమానియే కదా. **"ఉమ్మయిర్ వీడుడైయాన్"** ( మీ ఆత్మను నివాసంగా కలవాడు పరమాత్మ) అని కదా ఆ*ழ்*్వార్ల సూక్తి. (అయితే, ఇక్కడ ఆ ఇల్లు (జీవుడు) చేతనాత్మకం కనుక, ఎంతో కొంత ఆనందానుభవం జీవునకు కూడా కల్గడం సహజం). ఈ అంశమే **"తుయరఱు శుదరడి"** అనే ప్రయోగం ద్వారా సూచితం.

ఇక, ఈ అర్థం ప్రబంధ నిగమనంలో కూడా సూచింపబడిన వైనాన్ని గమనించాలి. ప్రబంధం చివరి దశకంలోని పదవ పాశురానికి ఆ పాశురంలోని **"ఎన్ అవా అఱ చ్చూ*ழ్*న్దాయ్"** (నా ఆర్తి తీరేటట్లు సంశ్లేషించావు – లేక, నా ఆర్తి అల్పమనే విధంగా చేసి సంశ్లేషించావు) అనే ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొని నమ్పిళ్ళై రెండు విధాలైన వివరణలను ఇచ్చారు. **"పెరితాన ఎన్నుడైయ విడాయ్ ఎల్లామ్ తీర వన్దు ఎన్నోడే కలన్దాయ్; ఎన్నుడైయ మనోరథముమ్ ఒరుపడి ముడియప్పెఱ్ఱేన్ – ఎన్గిఱార్"** (పెద్దది అయిన నా ఆర్తి అంతా తీరేటట్లు వచ్చి నాతో సంశ్లేషించావు. నా ఆశ కూడా ఒక విధంగా పూర్ణమైనది – అనిపల్కుతున్నారు) అనేది మొదటి అవతారిక. ఇది **"తుయరఱు శుదరడి"** అనే ప్రయోగానికి – ఆశ్రితుల దుఃఖాన్ని తీర్చే స్వభావాన్ని కల, వికస్వరమైన శ్రీచరణాలు – అనే పూర్వుల వివరణకు అనుగుణం. ఇక, శ్రీరామానుజులు చూపిన రెండవ అర్థనిర్వాహానికి అనుగుణంగా నమ్పిళ్ళై రెండవ అవతారికను – **"ఇని ఇలై –**

**ఎన్నుమ్బడి ఎన్నై విడాయ్‌ప్పిత్తు, అతుక్కు అవ్వరుకాన విడాయై యుడైయనాయ్ క్కొణ్డు, ఎన్నోడే కలన్ద ఉన్నుడైయ విడాయుమ్ ఒరుపడి కెట్టదే! – ఎన్గిఱారాకవుమామ్"** (ఇక ఇంతకు మించిన ఆర్తి లేదు – అనే విధంగా నాకు గొప్ప ఆర్తిని కలుగజేసి, దానికి ఏమాత్రం అందనంత చాలా గొప్ప ఆర్తిని కలవాడవై, నాతో సంశ్లేషించిన నీ ఆర్తికూడా అద్వితీయమైన రీతిలో తీరిందే! – అని పల్కుతున్నారనికూడా చెప్పవచ్చు) అని అనుగ్రహించారు. ఇక్కడ అరుంబదకారులు వివరిస్తూ **"ఇన్ద ఇరణ్డు యోజనైయుమ్ – తుయరఱు శుడరడి – ఎన్ఱు ఉపక్రమత్తిలే అరుళిచ్చెయ్ తత్తై ఉపసంహరిక్కిఱార్ – ఎన్నుమిడమ్ తోన్ఱుకిఱదు"** (ఈ రెండు అర్థనిర్వాహాల ద్వారా **"తుయరఱు శుడరడి"** అని ఆరంభంలో పల్కిన దానిని ఉపసంహరిస్తున్నారు– అనే విషయం స్ఫురిస్తున్నది) అని వివరించారు. దీనినిబట్టి ఇక్కడ మొదటి యోజన పూర్వుల వివరణను అనుసరించి, రెండవ యోజన శ్రీరామానుజుల వివరణను అనుసరించి చేయబడింది – అనేది సుస్పష్టం.

ప్రకృతంలో రెండవ యోజనను గమనించాలి. తత్త్వత్రయాన్ని సైతం కబళీకరించే రీతిలో ఉండే చాలా గొప్పదైన ఆழ்వార్ల ఆర్తిని సైతం "గోష్పాదమంత" అనే విధంగా అల్పంగా తోచేటట్లుగా ఉండే, భగవంతుడు ఆழ்వార్లపట్ల గల తన సముద్ర మంత అద్వితీయమైన, అసాధారణమైన ఆర్తిని చూపి, ఆ తన ఆర్తి అంతా తీరేటట్లు వారిని సంశ్లేషించాడు – అనేది ఈ యోజన తాత్పర్యం. ఇది **"ఇవన్ తుయరఱ త్తాన్ తుయర్ తీర్‌న్దానాయిరుక్కై"** అనే ప్రబంధంలోని మొదటి పాశురం లోని వివరణకు అనుగుణం. జీవునకు పరమాత్మను పొందడంలో ఉండే ఆర్తి కంటే, పరమాత్మకు జీవుని పొందడంలోని ఆర్తి చాలా గొప్పది అనే అర్థం. భగవద్గీతా సూక్తికి, బ్రహ్మసూత్రాలకు అనుగుణం కూడా. శారీరక మీమాంసలోని **"అనావృత్తిః శబ్దాత్"** (ముక్త పురుషుని కర్మానుభవం కోసం మళ్ళీ ఈ లోకానికి రాడు, ఆ విధంగా శబ్దతః చెప్పబడినందున) అనే చివరి సూత్రాన్ని శ్రీరామానుజులు వ్యాఖ్యానిస్తూ – **"న చ పరమపురుషః సత్యసంకల్పోత్యర్థప్రియం జ్ఞానినం లబ్ధ్వా న కదాచి దావర్తయిష్యతి"** (సత్యసంకల్పుడైన పరమాత్మ తనకు చాలా ఇష్టుడైన జ్ఞానిని పొంది, తిరిగి అతనిని ఈ లోకానికి రానివ్వడు) అని పల్కి, దానికి ప్రమాణంగా భగవద్గీతలోని **"ప్రియో హి జ్ఞానినోత్యర్థ మహం స చ మమ ప్రియః"** అనే సూక్తిని

ఉదాహరించారు. పై శ్రీరామానుజుల వ్యాఖ్యాన సూక్తిని పరిశీలించినపుడు ఈ గీతావచనంలో **"స చ మమ అత్యర్థం ప్రియః"** – (జ్ఞాని నానుక వాక్కుతో చెప్ప లేకనంత ఇష్టమైనవాడు) అనే అన్వయం వారికి వివక్షితమని స్పష్టపడుతున్నది. పై శ్రీ భాష్యసూక్తిని వివరించే శ్రుతప్రకాశికాచార్యులవారు కూడా **"జ్ఞానినః అత్యర్థ ప్రియత్వేన"** – అని పల్కడం గమనించాలి. ఈ వివరణ సూక్తికి "జ్ఞానికి భగవానుడు అత్యర్థ ప్రియుడని, జ్ఞాని భగవానునకు అత్యర్థ ప్రియుడని" – రెండు విధాలుగా అర్థం చెప్పే అవకాశమున్నది కదా! ఈ విధంగా శ్రీరామానుజులు చేసిన అర్థ నిర్వాహం గీతాసూక్తికి, శారీరక మీమాంసకు కూడా అనుగుణం.

తిరువాయ్ మొ*ழி* ప్రబంధం ఉద్గీథ ప్రణవ వివరణమని ఆచార్య హృదయ దివ్యసూక్తి. దానికి సూచన మొదటి పాశురంలోని మొదటి పాదు పాదాలలో ప్రణవంలోని అకార ఉకార మకారాలు మూడు నిక్షిప్తం కావడమే నని, తిరువాయ్ మొ*ழி* ప్రబంధం **"ఉయర్వఱ"** అని ఉకారంతో ఆరంభమై, **"ఉయర్న్దే"** అని త(ద) కారంతో పూర్తి అయినందు వల్ల ప్రత్యాహారన్యాయంలో ఉద్గీథ ప్రణవంలో ఉపాసింప బడే పరమాత్మ వాచకమైన "ఉత్" శబ్దం సూచింపబడిందని కూడా ఆచార్య హృదయ కారులు పల్కగా, ఈ సూక్తులను శ్రీవరవరమునులు ఎంతో అందంగా వివరించారు. ఈవిధంగా ప్రణవార్ధ ప్రతిపాదకం – తిరువాయ్మొ*ழி* ప్రబంధమనే అర్థ సమన్వయానికి ప్రకృతంలో శ్రీరామానుజులు **"తుయరఱు శుదరడి"** అనేసూక్తికి చేసిన అర్థ నిర్వాహం అనుకూలం. ఏ విధంగా అంటే, ప్రణవం ద్వారా సర్వశేషి అయిన భగవానునకే మకార వాచ్యుడైన జీవుడు శేషమై ఉన్నాడనే అర్థం తెలుప బడింది. శేషవస్తువు శేషికి ఇష్ట వినియోగార్హంగా, అనన్య భోగ్యంగా ఉంటుంది కదా! జీవునకు చైతన్య ప్రయుక్తంగా ఆనందం కల్గినా, ఆ ఆనందం భగవదానందాధీనమై ఉండాలని – అంటే – స్వరూపోచితమైన సకలవిధ కైంకర్యాలను తాను భగవానునకు చేసినపుడు, ఆ సేవలను చూచి పరమాత్మ ఆనందించగా, ఆ భగవానుని ఆనందాన్ని చూచి జీవుడు ఆనందించాలి – అనేది కదా క్రమం. దీనిని **"అహమన్న మదంతమద్మి"** (భగవానుడు, తనకు ఇష్టవినియోగార్హమైనందున, అనన్య బోగ్యుడైనందున అన్నం వంటివాడనైన నన్ను యథేష్టంగా కైంకర్యంలో వినియోగించుకొని ఆనందిస్తూ ఉండగా, ఆ విధంగా

ఆనందించే పరమాత్మకు నేను దర్శించి ఆనందిస్తున్నాను– అనుభవిస్తున్నాను) అనే శ్రుతి సూక్తి, **"తనక్కేయాక ఎనై కొళ్ళు మీదే"** అనే దివ్యసూరి సూక్తి విశదం చేస్తున్నవి. అందువల్ల పరమాత్మ ఆనందం ప్రధానం, జీవుని ఆనందం తదధీనం, అప్రధానం. జీవుని ఈ అనన్య భోగ్యత్వానికి శ్రీరామానుజుల అర్థ నిర్వాహం అనుగుణం. భగవానుడు, తమ ఆర్తికి మించిన, దానిని కబళీకరించే రీతిలో గొప్పదైన ఆర్తితో తమను సంశ్లేషించి ఆనందించగా, ఆ ఆనందాన్ని చాచి తాము కూడా ఆనందిస్తున్నానని ఆ౹్వార్లు పల్కడం వల్ల పరమాత్మకు గల ఆర్తి అత్యర్థం కనుక అది ప్రధానమని, అంతకంటే చిన్నది అయిన ఆ౹్వార్లు ఆర్తి అప్రధానమని కదా స్పష్టమవుతున్నది. ఇంతేకాక, **"అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే"** అనే శ్రీరామాయణ ప్రమాణంలో కూడా పరమాత్మ అయిన శ్రీరామ చంద్రుని ఆనందమే ప్రస్తావింపబడడం కూడా గమనించాలి. భరతుని ఆనంద ప్రసక్తి అందంలో కన్పించదు. ఇక్కడ భరతుని ఆనందం అర్థాత్ ఆక్షిప్తమని గ్రహించాలి.

జీవునకు కలిగే ఆర్తి, ఆనందాల కంటే – పరమాత్మకు కలిగే ఆర్తి, ఆనందాలు అధికంగా ఉండేటట్లే, జీవునకు కలిగే దుఃఖం కంటే, పరమాత్మకు కలిగే దుఃఖం కూడా అధికం. దీనిని శ్రీరామాయణం లోని **"వ్యసనేషు మనష్యాణాం భృశం భవతి దుఃఖితః"** అనే సూక్తి తెల్పుతున్నది. తన రాజ్యంలో ఎవరైనా దుఃఖం పొందితే అతడు పొందే దుఃఖం కంటే, అతని దుఃఖాన్ని చూచి శ్రీరాముడు పొందే దుఃఖం అధికమని కదా పై సూక్తిలోని భావం. దీనికి ఏమి కారణమేమంటే – జీవుని దుఃఖానికి కారణం. అతడు చేసిన దుష్కర్మ కనుక, ఆ కర్మ పరిమితిలో అతడు పొందే దుఃఖం ఉంటుంది. అయితే, శ్రీరాముని దుఃఖం కృపామూలకం కనుక, ఆ కృప నిర్హేతుక మైనందున నిరవధికం కనుక, తన్మూలంగా కలిగే దుఃఖం కూడా అనిరవధికంగానే కదా ఉంటుంది. ఇది శ్లోకంలోని **"దుఃఖితః భవతి, భృశం దుఃఖితః భవతి"** అనే ప్రయోగాల ద్వారా వ్యక్తం. ఈ విధంగా శ్రీరామానుజులు చూపిన అర్థ నిర్వాహం శ్రుతి తదుప బృంహణ దివ్యసూరిసూక్తులను అనుగుణం.

ఆశ్రితదుఃఖ ప్రయుక్తమైన దుఃఖం భగవానునకు ఉంటుందని, తాను దానిని తీర్చ గల్గినపుడు భగవానునకు ఆ దుఃఖం తీరుతుందనే అర్థంలో శ్రీరామానుజులు తిరువాయ్‌మొ౹్రి సూక్తిని నిర్వహించిన క్రమంయొక్క ప్రభావం తదనంతర

ఆచార్యుల సూక్తులలో స్పష్టంగా గోచరిస్తుంది. శ్రీపరాశర భట్టర్ శ్రీవిష్ణుసహస్ర నామ స్తోత్రం లోని **"అనిర్విణ్ణః"** (893) అనే నామాన్ని వివరిస్తూ – **"ఏవమాశ్రితం మహతా ప్రణిధానేన సంసార గర్తాత్ ఉత్తార్య ఆత్మానం ప్రాపయ్య చ, తమశోచ్యం పశ్యన్ అనిర్విణ్ణః" "కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ – ఇతివత్"** – (ఈ విధంగా తనను ఆశ్రయించిన నుండి బయటకు తీసి, తనవద్దకు చేర్చుకొని, అపుడతడు దుఃఖం తీరినవాడుగా కావడాన్ని గమనిస్తూ, తనలో అంతకు ముందు ఉండే నిర్వేదాన్ని తీరినవాడవుతున్నాడు కనుక **"అనిర్విణ్ణః"** అనబడుతున్నాడు) అని పల్కడం దీనికొక ఉదాహరణ. దీనికి ప్రమాణంగా **"కృతకృత్యః"** ఇత్యాది శ్రీరామాయణంలోని సంక్షేప రామాయణశ్లోకాన్ని ఉదాహరించారు. శ్రీరాముడు లంకలో రాక్షస రాజైన విభీషణునకు పట్టాభిషేకం చేసిన తరువాత కృతకృత్యుడై, మనస్సులోగల తాపం తీరినవాడై చాలా సంతషించాడు – అనేది ఈ శ్లోక భావం. ఇందులోని **"విజ్వరః", "ప్రముమోద"** అనే రెండు ప్రయోగాలు గమనార్హాలు. విభీషణ పట్టాభిషేకానికి ముందు శ్రీరామునకు మనస్సులో ఒక తాపమున్నదని, అది పట్టాభిషేకం చేసిన తరువాత తీరిందనే విషయాన్ని **"విజ్వరః"** అనే పదం తెలుపుతున్నది. ఇక **"ప్రముమోద"** అనే ప్రయోగంద్వారా, దుఃఖం తీరడమే కాదు చాలా గొప్ప ఆనందం కూడా శ్రీరామునకు కల్గింది – అనే అర్థం వ్యక్త మవుతున్నది. ఇక్కడ ఇంకొక గమనించదగిన విషయమేమంటే – **"ప్ర"** అనే ఉపసర్గతో కూడుకొన్న "ముమోద" అనే ప్రయోగం. ఈ ఉపసర్గవల్ల శ్రీరాముడు ప్రకృష్టమైన మోదాన్ని పొందాడని ఏర్పడతున్నది. అంటే – తనకు పట్టాభిషేకం జరిగినపుడు విభీషణుడు పొందిన ఆనందం కంటే, శ్రీరాముడు పొందిన ఆనందం ఎక్కువ అనే విలక్షణమైన అర్థం **"విభీషణః ముమోద – శ్రీరామః ప్రముమోద"** అనే క్రమం విభీషణునకు, శ్రీరామునకు అన్వయించడం ద్వారా స్ఫురిస్తున్నది.

**"అనిర్విణ్ణః"** అనే ఈ నామాన్ని భట్టరు ముక్తుని అనుభవాన్ని తెలిపే ప్రకరణానికి చెందినదిగా వ్యాఖ్యానించినందున భట్టర్ ప్రమాణంగా చూపిన శ్రీరామాయణ శ్లోకానికి విభీషణ పట్టాభిషేక పరంగా కథాక్రమంలో అర్థమైనా, తాత్త్విక దృష్టిలో చూచినపుడు ముక్తుని మోక్షసామ్రాజ్య పట్టాభిషేకపరంగా అర్థమని ఏర్పడుతున్నది.

నమ్బిళ్ళై రెండవ అవతారికకు అనుగుణంగా **"అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే"** (శ్రీరాముడు, భరతుని ఒడిలో కూర్చుండ బెట్టుకొని, ఆనందించిన వాడై, అతనిని ఆలింగనం చేసికొన్నాడు) అనే శ్రీరామాయణశ్లోకాన్ని ప్రమాణీక రించారు. ఈ శ్లోకం – తన సన్నిధిని చేరిన ముక్తపురుషుని తన దరిచేర్చుకొని, భగవంతుడు ఆనందించే క్రమాన్ని సూచిస్తున్నదని మన పూర్వాచార్యులు వివరించారుకదా! – ఈ విధంగా **"ఎన్ అవా అఱ చ్చూ*ఴ్*న్దాయ్"** (నా ఆర్తి అల్పం అయేటట్లు సంశ్లేషించావు) అనే ప్రబంధంలోని చివరి ప్రయోగంలో కూడా **"చేతన లాభం ఈశ్వరునిదే"** అనే విషయం సూచింపబడినందున ఆద్యంతాలలో ప్రబంధ ప్రధాన ప్రమేయం సూచింపబడడం – అనే మహాకావ్యలక్షణానికి కూడా శ్రీరామానుజులు చూపిన అర్థనిర్వాహం అనుగుణం. ప్రబంధం మహాకావ్యం లక్షణ సమన్విత మనేది కూడా ఇక్కడ స్ఫురిస్తున్నది.

ఈ అర్థం తిరువాయ్‌మొ*ఴ్రి* ప్రబంధం మధ్యలో కూడా అనుసంధింప బడడం గమనించవచ్చు. ఆ ప్రబంధంలోని 6వ శతకంలోని 9వ దశకంలో గల 4వ పాశురంలో **"శకడ వశురర్ ఉడల్ వేఱా ప్పిళన్దు వీయ తిరుక్కాలాణ్డ పెరుమానే!"**– (శకటాసురుని దేహం ఛిన్నమైభిన్నమై, రూపుమాసి పోయేటట్లు శ్రీచరణాలతో నిర్వహించిన స్వామీ!) అనేసూక్తిలో అర్థం తెలుపడింది. ఇక్కడ నంబిళ్ళై **"తమ్మై ఉణర్న్దు పరిమాఱుమ్బోదు దివ్యాయుధముమ్, అవైయుమ్ ఉతవాద పోదు తిరువడికళుమా యిరుక్కుఅపడి. నమ్ముడైయ ఆపత్తుక్కళిలే అన్ఱిక్కే, అవనుడైయ ఆపత్తుక్కుమ్ తిరువడికళేకాణు ముదవువదు"** (తమను తెలిసి రక్షించేటపుడు దివ్యాయుధాలు, అవి రక్షించనపుడు శ్రీచరణాలు రక్షిస్తాయి. మన ఆపదలలోనే కాక, భగవానుని ఆపదలలో కూడా శ్రీచరణాలే అతనిని రక్షిస్తాయి) అని వ్యాఖ్యానించడం గమనించవచ్చు. **"తిరుక్కాలాణ్డ"** – అనేటపుడు "శ్రీచరణాలతో రక్షించిన" – అని "శ్రీచరణాలు రక్షించిన" అని రెండు విధాలుగా అర్థాన్ని గ్రహించవచ్చు. మొదటిది ఆళవందార్ నిర్వాహపరం, రెండవది రామానుజ నిర్వాహ పరం.

ఈ సందర్భంలో ప్రస్తావించదగిన అందమైన అంశాలు ఇంకా చాలా ఉన్నా, విస్తృతి భీతితో ఏతావతా విరమింపబడుతున్నది. శ్రీరామానుజుల యోజనలలో

ఇమిడి ఉంటే అర్థగాంభీర్యం ఎంత గొప్పదో! సూచించడంకోసమే కొంత విస్తృతంగా విషయప్రస్తావన చేయబడింది. ఇక, మిగిలిన నిర్వాహాలు సంగ్రహంగా వివరింప బడతాయి.

## ఆళ్వార్ల ప్రపత్తి, సాధ్యభక్తి పర్యాయాలు

### 2. (1-2) ఈడు వ్యాఖ్యానావతారిక

**"ఇత్తిరునాయ్‌మొழிతన్నై ఆళవన్దార్ అరుళిచ్చెయ్‌దారాక త్తిరుమాలై యాణ్డాన్ ప్రపత్తివిషయమాక నిర్వహిత్తుక్కొణ్డు పోన్దు, ఎమ్బెరుమానారుమ్ అప్పడియే అరుళిచ్చెయ్‌దు కొణ్డుపోన్దు, భాష్యమ్ తలైక్కట్టిన పిన్బు భక్తివిషయమాక అరుళిచ్చెయ్‌దుకొణ్డు పోరువర్. పిన్బు ఎమ్బారుమ్ అప్పడియే అరుళిచ్చెయ్‌దార్".**

(ఈ దశకాన్ని ఆళవన్దార్ ప్రపత్తి విషయంగా నిర్వహించేవారని తిరుమాలై యాణ్డాన్‌కూడా ప్రపత్తిని విషయంగానే నిర్వహించారు. శ్రీరామానుజులు సైతం ఆ విధంగానే నిర్వహించేవారు. శ్రీభాష్యరచన పూర్తి అయిన పిమ్మట భక్తిపరంగా అన్వయించేవారు. తరువాత ఎమ్బార్ కూడా ఆ విధంగానే అన్వయించి పలికారు).

**"వీడుమిన్ ముற்றవుమ్"** అనే దశకంలో ఆళ్వార్లు భక్తిని ఉపాయంగా పలికారా? లేక, ప్రపత్తిని ఉపాయంగా పలికారా? అనే విషయాన్నిగూర్చి పూర్వులు, పల్కిన నిర్వాహం, శ్రీరామానుజుల పల్కిన నిర్వాహం ఇక్కడ ప్రస్తావింప బడుతున్నాయి.

**"వీడుమిన్ ముற்றవుమ్"** అనే దశకంలో ఆళ్వార్లు ప్రపత్తియోగాన్ని గూర్చి పలికారని ఆళవందార్ తెలిపేవారు. వారి శిష్యులు తిరుమాలైయాణ్డాన్ కూడా ఆ విధంగానే శ్రీరామానుజులకు తెలిపారు. శ్రీరామానుజులు సైతం మొదట అదేవిధంగా ప్రపత్తిపరంగానే ఈ దశకాన్ని అన్వయించి పల్కినా, శ్రీభాష్యగ్రంథ రచన పూర్తి అయిన తరువాత గుహ్యతమోపాయమైన ప్రపత్తిని బట్టబయలు చేయరాదని తలచి, ప్రపత్తి సాధ్యభక్తిగా చెప్పబడుతున్నందున, ఈ దశకం (సాధ్య) భక్తిపరమని తెలిపారు. వారి శిష్యులైన ఎమ్బార్‌కూడా ఈ దశకాన్ని (సాధ్య) భక్తి విషయంగానే తెలిపారు. (సాధ్యభక్తి అంటే భగవదనుగ్రహం వల్ల సాధ్యమైన భక్తి).

ఈ నిర్వాహాన్ని నమ్మిక్కై మళ్ళీ తిరువాయ్‌మొ౹్రిలోని (10-4) **“శార్వే తవనెతి”** అనే దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహిస్తూ తమ ఈడు వ్యాఖ్యలో ఈ క్రింది రీతిలో ప్రస్తావించారు.

**“ఆళవన్దార్ అరుళిచ్చెయ్‌దదాక త్తిరుమాలైయాణ్డాన్ పణిప్పదు - ప్రపత్తి విషయమాకవాయ్‌త్తు, వీడుమిన్ ముగ్ఱ్రవుమ్”. ఉడైయవరుమ్ అప్పడియే ప్రపత్తి విషయమాక అరుళిచ్చెయ్‌దుకొణ్డు పోన్దు, భాష్యమ్ అరుళిచ్చెయ్‌ద పిన్బు రహస్యో పాయత్తై వెళియిడవొణ్ణాదు - ఎన్ఱు “వీడుమిన్ ముగ్ఱ్ర” త్తైయుమ్ భక్తివిషయమాక్కి అరుళిచ్చెయ్‌దార్.** (**“వీడుమిన్ ముగ్ఱ్రవుమ్”** అనే దశకం ప్రపత్తి విషయమని ఆళవందార్ తెలిపేవారని తిరుమాలై యాణ్డాన్ అనేవారు. శ్రీరామానుజులు కూడా ఆ విధంగానే ప్రపత్తిని పరంగా అన్వయించి పల్కుతూ, శ్రీభాష్యం రచించిన తరువాత, రహస్యోపాయమైన ప్రపత్తిని వ్యక్తం చేయరాదని **“వీడుమిన్ ముగ్ఱ్రవుమ్”** దశకాన్ని భక్తివిషయంగా పలికారు).

**“వీడుమిన్”** దశకాన్ని మొదట ప్రపత్తిపరంగా అన్వయించి పల్కిన శ్రీరామానుజులు, తరువాత భక్తివిషయంగా పల్కడంలో గల అవకాశం, ఔచిత్యం ఏమి? అనే అంశాలు ఇక్కడ గమనించదగినవి.

భక్తి అనేది – సాధ్యభక్తి అని, సాధన భక్తి అని రెండు విధాలు. సాధ్య భక్తికే ప్రపత్తి అని పేరు. సాధన భక్తి అనేది వివేకవిమోకాదిసాధన సప్తకాన్ని, శమదమాదు లను అంగంగా కల్గినది. ఈ దశకంలోని **“తిణ్‌క౹్రల్ శేర్”** (దృఢమైన భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించు) అనే ప్రయోగం ఈ దశకం ప్రపత్తిపరమని పల్కడానికి సూచకం. శరణవరణాత్మకంకదా ప్రపత్తి. ఇక, సాధన భక్తి పరమైన నిర్వాహానికి **“ఎల్లైయిల్ అన్నలమ్ పుల్కు పగ్ఱ్రగ్ఱ్రే”** (అందులేని ఆనందాన్ని స్వరూపంగా కల భగవంతుని, ఇతర విషయ సంగాన్ని వీడి, ఆశ్రయించు) అని, **“పగ్ఱ్రిలయాయ్ అవన్ ముగ్ఱ్రిల్ అడఙ్గు”** (ఇతర విషయసంగరహితుడవై అతని ధారకత్వం మొదలైన స్వభావాలలో నమ్మికను కల్గి అణగి ఉండు) అనే ప్రయోగాలు సూచకాలు. వీటివల్ల, **“స్నాత్వా భుంజీత”** (స్నామాడిన తరువాత భుజించాలి) అనే వాక్యాలలో **“అంగాంగి భావం”** తోచినట్లు, అంటే – అంగి అయిన భోజనానికి స్నానం అంగంగా విధింపబడినట్లు, భక్తిరూపమైన ఉపాసనకు, అంటే – అంగికి, –

**"పఱ్ఱఱ్ఱ్రే"** అని, **"పఱ్ఱిలయాయ్"** అని ఇతర విషయ సంగత్యాగం అనేది అంగంగా విధింపబడింది – అని తెలుస్తున్నది. అందువల్ల శ్రీరామానుజులు ఈ దశకాన్ని మొదట ప్రపత్తి పరంగా పల్కినా, తరువాత, వేద గుహ్యరహస్యోపాయమైన ప్రపత్తిని యోగ్యులకు తప్ప అన్యులకు వ్యక్తం చేయరాదని తలచి, భక్తిపరంగా పూర్వోక్తసూచకవాక్యాలనుబట్టి అన్వయించి పలికారు.

అయితే, ప్రపత్తి అనేది **"భగవత్ప్రవృత్తి నిరోధక స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః"** (భగవానుడు జీవుని రక్షించాలని చేసే ప్రయత్నానికి అడ్డుగా ఉండే స్వప్రయత్నాన్ని విరమించడమే ప్రవృత్తి) అని నివృత్తిరూపమైనది. కర్మజ్ఞానాలను అంగాలుగా కల్గిన భక్తి ప్రవృత్తిరూప మైనది. ఈ విధంగా భక్తి – ప్రపత్తులు స్వరూపంలో ప్రవృత్తి రూప నివృత్తి రూపాలైనందున పరస్పర విరుద్ధాలైనని. అపుడు, ఒకే దశకాన్ని ప్రపత్తిపరంగా, భక్తిపరంగా – రెండు విధాలుగా అన్వయించి పల్కడు ఏవిధంగా కుదురుతుంది? అనే సందేహం కలుగవచ్చు. ఇంతేకాక, ఆఴ్వార్లు భక్తినిష్ఠులా? లేక, ప్రపత్తి నిష్ఠులా? భక్తినిష్ఠులైతే తాము ఉపాసించే సాధన భక్తిని ఉపాయంగా పలకాలి. ప్రపత్తి నిష్ఠులైతే, ఆ ప్రపత్తినే ఉపాయంగా ఇతరులకు ఉపదేశించాలి. తాము ఒక ఉపాయాన్ని ఆచరించి, ఇంకొక ఉపాయాన్ని పరోపదేశం చేయడం ప్రతారణమే కదా? అనేది ఇంకొక సందేహం.

అన్యుల భక్తివలె ఆఴ్వార్ల భక్తి సాధనకోటిలోనికి చేరదు. **"భక్తి ప్రాప్యరుచియిలే కైపు కురుమ్"** (భక్తి ప్రాప్యరుచిలో అన్వయిస్తుంది) అనే శ్రీవచన భూషణ శ్రీసూక్తివలె వీరి భక్తి భోజనానికి ఆకలివలె, ప్రాప్యమైన భగవదనుభవం పట్ల వీరికి గల రుచికి సూచకం. ఇక, ప్రపత్తి అనేది స్వరూపయోగ్యతను కల్గిస్తుంది. కనుక స్వరూపంలోనికి చేరుతుంది. ఆఴ్వార్లు, ప్రపత్తి నిష్ఠులనడంలో ఏ సందేహం లేదు. ఈ ప్రపత్తియే సాధ్యభక్తి. వీరి ప్రపత్తి ఆర్తప్రపత్తి అయినందున భగవత్ ప్రావణ్యం అతిశయించి ఉంటుంది. అందుచేత ఉత్కటమైన వీరి ప్రావణ్యాన్ని చూచినపుడు ఒకసారి భక్తి అని, ఇంకొక సారి ప్రపత్తి అని ఉల్లేఖించేటట్లు ఉంటుంది. లేక, **"మునియే! నాన్ముకనే"** అనే చివరి దశకంలో ఆఴ్వార్ల భక్త్యతి శయాన్ని చూచి భగవంతుడు అనుగ్రహించినందున భక్తిప్రపత్తులు రెండు వీరికి ఫలసాధనాలుగా వికల్పించేటట్లు ఉంటుంది. అంతేకాక, ఆఴ్వార్లు ప్రాప్యం,

ప్రాపకం – రెండు భగవంతుడే అనే నిశ్చయాన్ని కలవారైనందున, వీరికి భక్తి ప్రపత్తులు రెండు తుల్యఫల సాధనాలుగా భావించే రీతిలో ఉంటుంది. సారంగా ఏమంటే – ఆళ్వార్లకు భక్తి, ప్రపత్తి – రెండు ఉన్నాయని తెలుపడమే ఇక్కడ పరమోద్దేశ్యం. అయితే, పరమ రహస్యమైన ప్రపత్తిమార్గంపై గురి కుదరడం చాలా కష్టం కనుక, అందఱికి దానిని వ్యక్తం చేయరాదని తలచిన శ్రీరామానుజులు, **"వీడుమిన్ ముఱ్ఱ వుమ్"** దశకాన్ని భక్తిపరంగా కూడా అన్వయించే అవకాశం ఉన్నందున, ప్రపత్తి అనే పేరుతో కాకుండా, సాధ్యభక్తి అనే పేరుతో దశకాన్ని భక్తియోగపరంగా అన్వయించారు. ఆళ్వార్ల భక్తి "కర్మజ్ఞానసహకృతమైన సాధన భక్తికాదు. ఆ కర్మ జ్ఞానాల స్థానంలో భగవదనుగ్రహమే మూలంగా ఏర్పడిన భక్తియే ఆళ్వార్ల భక్తి. అందుచేత కర్మజ్ఞానాలవల్ల ఉపాసకునకు కలిగే సాధనభక్తి కంటే, భగవదను గ్రహంవల్ల కల్గిన ఆళ్వార్ల భక్తి విలక్షణమైనది, సాధ్యరూపమైనది – అని గ్రహించాలి. వేదాంతవిహితమైన సాధనభక్తినే ఆళ్వార్లు ఈ దశకంలో ఉపదేశిస్తున్నారని భావించరాదు. అపుడు **"వెఱిదే అరుళ్ శెయ్‌వర్"** (సహజకృపతో భగవానుడు అనుగ్రహిస్తాడు), **"ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక త్తన్దొళ్ళిన్దాయ్"** (నాకు ఉపాయంగా నీవు నీ శ్రీచరణాలనే అనుగ్రహించావు) ఇత్యాది సూక్తులకు విరోధం రావడమే కాక, అపశూద్రాదికరణ న్యాయానికి కూడా విరోధం వస్తుంది. ఆళవందార్ ప్రభృతుల ప్రపత్తి పరమైన నిర్వాహానుసారం – ఈ దశకంలో ప్రపత్తి స్వరూపం, తదుపయుక్తాలైన అర్థాలు ప్రతిపాదింపబడడం ద్వారా ప్రపత్తిలో ఈ దశకం పర్యవసిస్తున్నదని అభిప్రాయం. శ్రీరామానుజుల నిర్వాహంలో – ఆళ్వార్ల భక్తి ప్రాప్యరుచిలోకి పర్య వసిస్తుంది కనుక, ఆ ప్రాప్యరుచిని ప్రతిపాదించడానికి తగిన అర్థాలను ఇందులో పల్కిన, ఈ దశకం ప్రాప్యరుచిరూపమైన సాధ్యభక్తిలో పర్యవసిస్తున్నదని తెలుపబడింది.

శ్రీభగవద్విషయం – అడైయవళైన్దాన్ అరుంబదంలో – శ్రీభాష్యరచనా నంతరం శ్రీరామానుజులు ఈ దశకాన్ని సాధనోపాసనపరంగా అన్వయించారనే ఇంకొక క్రమంకూడా అర్థాంతరంగా చూపబడింది. **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** (అన్నిటినీ వదలండి) అని అనడం ద్వారా **"శమదమాద్యుపేత స్స్యాత్"** (శమం, దమం మొదలైనవానిని కల్గినవాడై ఉండాలి) అనే సూత్రార్థం తెలుపబడింది.

**"మిన్నిన్ నిలై"** ఇత్యాది పాశురంలో వైరాగ్య పాదార్థం సూచింపబడింది. **"పుల్కు"** (భోగరూపంగా ప్రీతిపూర్వకంగా ధ్యానించు) అని అనడంవల్ల భగవదనుసంధానానికి ప్రీతిరూపత్వం తెలుపబడింది. **"అఱ్ఱదు పఱ్ఱనిల్"** అనే పాశురంలో **"ఉఱ్ఱదు వీడుయిర్"** (ఆత్మ మోక్షాన్ని పొందింది) అని యోగశాస్త్రంలో చెప్పబడే క్రమంలో జ్ఞానయోగంలో ఆత్మసాక్షాత్కారం కలిగేటపుడు ఆత్మయొక్క ఆనంద రూపమైన భోగ్యత ఆవిష్కృతమవుతుంది కనుక, "ఆ ఆత్మానుభవంలోనే కాలు తడబడే అవకాశం ఉన్నది సుమా! తావన్మాత్రమైన అల్పానుభావంలో చిక్కుకోకండి" – అని ఉపదేశించినందున ఈ దశకం ఉపాయభక్తిపరమని పక్షాంతరంగా చూపబడింది. అయితే, దీనికంటే ప్రాప్యభక్తి పరమైన ప్రథమ నిర్వాహమే యుక్తతరం. ఈడులోని **"శ్రీభాష్యమ్ తలైక్కట్టిన పిన్బు"** అనే వాక్యానికి కాలవిశేషప్రదర్శనమే ప్రధానోద్దేశ్యమని భావించాలి. అరుంబదకారులు కూడా – **"ఇప్పడి యోజనాద్వయత్తైయు మరుళిచ్చెయ్దు, పరమాచార్యయోజనై అభ్యర్హిత మెన్ఱు తమక్కు తిరువుళ్ళమానపడియై అరుళిచ్చెయ్‌కిఱార్"** (ఈ విధంగా ప్రపత్తి, భక్తిరూపాలైన రెండు యోజనలను పల్కి, వీటిలో ఆళవందార్ నిర్వహించిన ప్రపత్తిపరమైన నిర్వాహమే ముఖ్యమనే తమ అభిప్రాయాన్ని తెల్పుతున్నారు) అని అన్నారు. అయితే, శ్రీభాష్యకారులచే భక్తిపరమైన నిర్వాహం – పరమగుహ్యమైన ప్రపత్తిని అందఱికి వ్యక్తం చేయకూడదనే ఉద్దేశ్యంతోనే చేయబడింది. అంతేకాక, శ్రీభాష్యంలో భక్తి మోక్షోపాయంగా ప్రతిపాదింపబడినందున, దానికి అనుగుణంగా కూడా ఈ నిర్వాహం చేయబడిందని భావించాలి. ఉభయ వేదాంతసమన్వయ దృష్టిని కల్గినవారుకదా, మన పూర్వాచార్యులందఱు. అంతేకాక **"సహస్రశాఖోప నిషత్సమాగమం ద్రావిడ వేదసాగరమ్"** అని, **"ద్రామిడీం బ్రహ్మసంహితామ్"** అని కదా తిరువాయ్‌మొழ்ழி కీర్తింపబడుతున్నది. **"వీడుమిన్"** అనే దశకాన్ని భక్తిపరంగా శ్రీరామానుజులు అన్వయించి పలికే క్రమాన్ని అనుసరించి అనంతర కాలంలో తిరువాయ్‌మొழ்ழி లోని మొదటి రెండు దశకాలు శ్రీభాష్యంలోని నాల్గు అధ్యాయాల సారాన్ని తెల్పుతున్నవి – అనే శ్రీభాష్య ద్రమిడాగమాల ఐకకంఠ్యాన్ని పూర్వాచార్యులు ప్రతిపాదించారు. కూడా. ఆఱాయిరప్పడి, ఇరుపత్తు నాలాయిరప్పడి, ఒన్బదినాయిరప్పడి పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో భక్తియోగ పరంగానే వివరింప బడింది.

**"వీడుమిన్ ముற்றవుమ్"** అనే దశకాన్ని శ్రీభాష్య రచనానంతరం శ్రీరామానుజులు భక్తిపరంగా అన్వయించి పలికేవారనే శ్రీరామానుజులు నిర్వాహాన్ని బట్టి ఈ దశకం కేవలం ఉపాయపరమనేది వారి అభిప్రాయంగా తోస్తున్నది కదా! ఈడువ్యాఖ్యానంలో కూడా **"ఉపాసనపరమాక చ్చొల్లవేణ్డుమవற்றక్కెల్లామ్ సంగ్రహమాయిరుక్కిఅదు, ఇత్తిరువాయ్‌మొழி"** అని చెప్పబడింది. అయితే, తిరువాయ్‌మొழிలోని **"ఉయర్వఱ"** అనే ప్రథమ దశకం శారీరకం మీమాంసలోని పూర్వద్వికానికి, **"వీడుమిన్"** అనే రెండవ దశకం ఉత్తరద్వికానికి సంగ్రహమనే ప్రసిద్ధమైన పూర్వాచార్య సమ్మతమైన నిర్వాహం ఏ విధంగా పొసగుతుంది? అంటే, ఫలం ఉపాయసాధ్యం కనుక, ఉపాసన పరమనే సూక్తివల్ల ఉపాయం, ఫలం రెండూ సూచింపబడతాయి కనుక విరోధం లేదు. ఈ అంశాన్ని ఉభయ వేదాంతైకకంర్యంలో అழகియమణవాళ చ్చీయర్ విశదంగా ప్రతిపాదించారు.

శారరకోత్తరద్వికానికి, **"వీడుమిన్ ముற்றవుమ్"** అనే దశకానికి ఐకమత్యం ఏ విధంగా కుదురుతుంది? అంటే – శారీరకంలోని తృతీయ, చతుర్థాధ్యాయాలలో ప్రతిపాదింపబడిన సాధనం, తత్ఫలం అనేవి **"వీడుమిన్"** దశకంలో పరోపదేశ రూపంలో ప్రతిపాదింపబడడం వల్ల ఐకమత్యం సిద్ధం అయితే, నంబిళ్ళై ఈడులో ఈ తిరువాయ్‌మొழி తృతీయాధ్యాయంలో ప్రతిపాదింపబడిన ఉపాసనను తెల్పు తున్నది – అని అన్నారే తప్ప, తృతీయచతుర్థాధ్యాయాలో తెలుపబడిన ఉపాయ ఉపేయాలను తెల్పుతున్నది – అని ఎందుకు అనలేదు! అంటే, ఉపాసన శబ్దం ఫలాన్ని కూడా లక్షిస్తుంది – అనే దృష్టితో ఉపాసన పరమని అన్నారు. లేక, ఈ ఉపాసన శబ్దం లక్షణావృత్తి ద్వారా జ్ఞానసామాన్యాన్ని తెల్పుతుంది. మోక్ష సాధన రూపమైన ఉపాయం, ఫలరూపమైన పరబ్రహ్మానుభవం – అనే ఈ రెండు జ్ఞానావస్థావిశేషాలే కనుక, రెండిటిని ఉపాసనశబ్దంతో తెలిపారు – అని చెప్పవచ్చు. ఈ రెండు జ్ఞానావస్థావిశేషాలే – అనే విషయాన్ని శ్రీదేశికులు రహస్యత్రయ సారంలోని **"ఉపాయమావదు – ఒరు జ్ఞానవికాసవిశేషమ్. ఇత్తాలే సాధ్యమాయ్, ప్రాప్తి రూపమాన ఉపేయమావదుమ్ – ఒరు జ్ఞానవికాస విశేషమ్. ఇవற்றిల్, ఉపాయ మాకిఱ జ్ఞానవికాసవిశేషమ్ – కరణత్రయసాపేక్షమాయ్, శాస్త్రవిహితము మాయ్, సత్యత్వాదికళాన స్వరూపనిరూపక ధర్మజ్ఞళోడే కూడిన అవ్వో విద్యావిశేష**

**ప్రతి నియతగుణాదికళినాలే నియతబ్రహ్మ విషయముమా యిరుక్కుమ్. ఉపేయ మాకిఱ జ్ఞానవికాసవిశేషమ్ – కరణనిరపేక్షముమాయ్, స్వభావప్రాప్తము మాయ్, గుణవిభూత్యాదికళ్ ఎల్లావ*ర్ర్రా*లుమ్ పరిపూర్ణబ్రహ్మవిషయముమా యిరుక్కుమ్"** ( ముముక్షువులైన ఆ*ళ్వా*ర్లకు ఉపాయమంటే – అది ఒక విశేషమైన జ్ఞాన వికాసం. దీనివల్ల సాధింపబడేదై, ప్రాప్తిరూపమై ఉండే ఉపేయం కూడా ఒక విలక్షణమైన జ్ఞానవికాసమే. ఉపాయమనే జ్ఞానవికాసవిశేషం – మూడు కరణాలతో చేయబడేది, శాస్త్రంలోని విధింపబడినది, సత్యత్వం మొదలైన స్వరూపనిరూపక ధర్మాలతో కూడిన, ఆయా బ్రహ్మవిద్యలతో విధింపబడిన గుణాదులతో నియతమైన పరమాత్మకు చెందినదై ఉంటుంది. ఇక, ఉపేయమైన జ్ఞానవికాసవిశేషం – కరణాపేక్ష లేనిదై, స్వభావంవల్లనే ప్రాప్తమై, కల్యాణగుణాలు, విభూతులు మొదలైనవానితో పరిపూర్ణమైన పరబ్రహ్మకు చెందినదై ఉంటుంది) అని అన్నారు.

లేక **"వీడు శెయ్మినే"** – అనే మొదటి పాశురం నుండి, **"తిణ్క*ళ్ళ*ల్ శేరే"** అనే చివరి పాశురం వరకు ఆ*ళ్వా*ర్లు మోక్షోపాయాన్ని ప్రతిపాశురంలోను వాక్యార్థ రూపంగా ప్రధానంగా తెలిపారు. ఆ ఉపాయానికి అంగంగా ఉండేవానిని, మోక్షోపాయంద్వారా లభించే ఫలాన్ని పదార్థరూపంగా అప్రధానంగా పలికారు. ఈ విధంగా తెలుపడం వైదిక ప్రక్రియాను గుణమే. **"స్వర్గకామో యజేత"** (స్వర్గాన్ని కోరేవారు జ్యోతిష్టోమయాగాన్ని చేయాలి) అనేచోట స్వర్గసాధనమైన జ్యోతిష్టోమయాగం వాక్యార్థమైనందున ప్రధానమై, ఫలరూపమైన స్వర్గం పదార్థమైనందున అప్రధానమైనందున ఈ వాక్యాన్ని జ్యోతిష్టోమయాగరూపసాధన పరమని అభియుక్తులు వ్యవహరిస్తాయి కదా. ఆ విధంగానే **"వీడుమిన్ ము*ర్ర్రు*వుమ్"** దశకాన్ని కూడా నమ్బిళ్ళై ఉపాసనరూపసాధనపరంగా వ్యవహరించారని చెప్పవచ్చు. అందుచేత, నమ్బిళ్ళైకుకూడా ఈ దశకంలో ఫలప్రతిపాదనం ఉపసర్జనంగా (అప్రధానంగా) వివక్షితమే కనుక, **"వీడుమిన్ ము*ర్ర్రు*వుమ్"** అనే దశకం ఉపాసనపరమనే నమ్బిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తితో – ఉపాయ – ఉపేయాలను రెండిటిని ప్రతిపాదించే శారీరకమీమాంసలోని ఉత్తరద్వికార్థాన్ని ఈ దశకం ప్రతిపాదిస్తున్నది – అనే నిర్వాహంతో ఏ విరోధం లేదు. ఈ దశకంలోని మొదటి పాశురం ద్వారా తృతీయాధ్యాయంలోని మొదటి పాదార్థం, రెండవ, మూడవ

పాశురాల ద్వారా ద్వితీయ పాదార్థం, నాల్గవ, అయిదవ, ఆఱవ, ఏడవ పాశురాల ద్వారా తృతీయపాదార్థం, ఎనిమిదవ పాశురం ద్వారా చతుర్థ పాదార్థం ప్రతిపాదింప బడ్డాయి. తొమ్మిదవ, పదవ పాశురాల ద్వారా చుతర్థాధ్యాయంలోని నాల్గు పాదాల అర్థం సంగ్రహింపబడింది. ఈ విధంగా పది పాశురాలలో అధికంగా ఎనిమిది పాశురాలు ఉపాయపరమైన తృతీయాధ్యాయంలోని అర్థాన్ని ప్రతిపాదిస్తున్నందువల్ల కూడా ఈ ప్రాధాన్యాన్నిబట్టి **"ప్రాధాన్యేన వ్యపదేశాః భవంతి"** అనే రీతిలో ఈ దశకం ఉపాసనపరమని నున్నారని కూడా చెప్పవచ్చు. ఇక, చివరిది అయిన ఫలశ్రుతి పాశురంలో ఈ దశకంలో ప్రతిపాదింపబడిన, భగవానుడు దరి చేరదగినవాడు, పొందదగినవాడు – అనే అంశాలను తెలిపే సౌలభ్యాది గుణాలు సంగ్రహంగా ప్రతిపాదింపబడ్డాయి.

ఇంకా, ఈ దశకం సాధ్య భక్తిపరమా! సాధనభక్తి పరమా – అనే విషయాన్ని గూర్చి వేదాంతశాస్త్రద్రవిడాగమైకకంఠ్యంలో విస్తృతంగా విచారింపబడింది.

శారీరకమీమాంసలోని తృతీయాధ్యాయం ప్రథమ పాదంలో – మొదటి ఆఱు అధికరణాలతో భక్తిరూపమైన ఉపాసన స్వరూపం శోధింపబడింది. ఏడవ అధికరణం నుండి అయిదు అధికరణాలలో ఈ దేహంతో సంబంధం కల దశలో ఏర్పడే విద్యాఫలాన్ని నిరూపించారు. రెండవ పాదంలో దశలో కలిగే విద్యా ఫలాన్ని నిరూపించారు. రెండవ పాదంలో జీవుని ఉత్క్రాంతికి చెందిన నిరూపణం చేశారు. ఈ విధంగా రెండు పాదాలలో నిరూపించిన అర్థాన్ని **"వీడుమిన్ ముఱ్ఱ వుమ్"** అనే దశకంలోని **"ఒడుజ్గ అవన్ కణ్ ఒడుజ్గలుమెల్లామ్, విడుమ్, పిన్నుమ్ ఆక్కై విడుమ్ పొழுదెణ్ణే"** (స్వామి సన్నిధిలో అపృథక్ సిద్ధ రూపంగా చేరి ఆశ్రయిస్తే ఆత్మకు గల అజ్ఞానాదిరూపమైన స్వరూపసంకోచం, దానికి హేతువైన అవిద్యాదులు అన్నీ విడచిపోతాయి. తరువాత ప్రకృత శరీరం విడిచిపోయే సమయాన్ని గూర్చి చింతిస్తూ ఎదురు చూడాలి) అనే తొమ్మిదవ పాశురంలో ఆழ்వార్లు తెలిపారు. అది ఏవిధంగా అంటే, "స్వామివద్ద అపృథ సిద్ధ రూపంగా చేరి ఆశ్రయిస్తే" – అని తెలిపే **"ఒడుజ్గ అవన్‌కణ్"** అనే మొదటి పాదంలో తృతీయాధ్యాయం ప్రథమ పాదంలోని ఆఱు అధికరణాలలో నిరూపించిన ఉపాసన స్వరూప శోధనం తెలుపబడింది. **"ఒడుజ్గ"** అనే అంశాన్ని పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలో భజనపరంగా

అన్వయించి పల్కడం స్పష్టం. ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో **"భజన మెళితా నాలుమ్"** అని, **"భజనమావదు తాన్ తనక్కాకన్ద కరణఙ్గళై అవనుక్కు కొ్దుక్కై"** (తనకోసం ఇచ్చిన కరణాలను భగవానునకు సమర్పించడం) అని అన్నందున ఈ ప్రయోగం భజనపరంగానే పూర్వాచార్యులు కూడా వ్యాఖ్యానించారు.

అయితే, **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** దశకం ప్రపత్తి పరం, **"పత్తుడై యడియవర్"** దశకం భక్తిపరమనే వ్యవస్థకు ఈ వివరణం విరుద్ధం కదా! అంటే, భగవద్రామానుజులకు ముందున్న ఆచార్యులు ఈ విధంగా నిర్వహించినా, శ్రీరామానుజులకు తరువాత గల ఆచార్యులు **"వీడుమిన్"** దశకాన్ని భక్తిపరంగా అన్వయించినందున, వ్యాఖ్యాతలు అందఱు భజనపరంగా స్ఫురించేటట్లే వ్యాఖ్యానం చేసినందున ఇక్కడ అర్థం విరోధం లేదు.

**"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** దశకం భక్తిపరంగాను ఈ **"ఒడుఙ్గ అవన్కణ్"** అనే ప్రయోగం భజనపరంగాను వివరణం చేయబడినా, "సాధ్యభక్తిని ఈ దశకం ప్రతిపాదిస్తున్నది", అని **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** దశక ప్రవేశంలో ఈడు వాఖ్యాత స్వయంగా నిర్ణయించినందున, ఈ ప్రయోగం సాధన భక్తిప్రకారాన్ని ప్రతిపాదించే ఆఱు అధికరణాల అర్థానికి ఏవిధంగా సూచకం? అంటే – నాథముని మొదలైన మన పూర్వాచార్యులు అనుష్ఠించిన సాధ్యభక్తికి ( ప్రపత్తికి ), ఉపాసకులు అనుష్ఠించే సాధన భక్తికి తేడా ఏమంటే – సాధనత్వబుద్ధి లేకపోవడం, సాధనత్వబుద్ధి ఉండడం – అనేవే తప్ప, స్వరూపంతో ఏ తేడా లేదు. కనుక యమనియమప్రాణాయామాదులు కాని, కీర్తనయజన నమస్కారాదులు కాని, శుచి అయిన దేశంలో చేలాజిన కుశోత్తరాలలో కూర్చుని ఉపాసన చేయడంకాని, ఏకాగ్రతను కల్గిన మనస్సును కల్గి ఉండడం కాని – ఇటువంటి అన్ని అనుష్ఠానాలు సాధ్యసాధన భక్తులకు రెండిటికి సమానం కనుక, **"ఒడుఙ్గ అవన్ కణ్"** అనే ప్రయోగం సాధ్యభక్తిని తెల్పినా, ఇందులో సాధనభజన ప్రకారాన్ని సూచించేదిగా పల్కడంలో అడ్డు లేదు.

శ్రీభాష్య రచనానికి పూర్వం **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** దశకాన్ని ప్రపత్తి పరంగా, తరువాత భక్తిపరంగా శ్రీరామానుజులు అన్వయించడానికి గల కారణాన్ని అరుంబదకారులు కొంత స్పష్టం చేశారు.

శ్రీభాష్యంలో వివేక విమోకాది సాధనసప్తకం, శమదమాదులు అంగాలుగా ఉపాసనకే (భక్తికి) విధింపబడ్డాయని **"ఆహార శుద్ధి సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః "** (ఆహారం శుద్ధంగా ఉంటే సత్త్వశుద్ధి కల్గుతుంది. సత్త్వశుద్ధి కల్గితే స్మృతి స్థిరంగా ఉంటుంది), **"ఆత్మన్యేవాత్మానం పశ్యేత్"** ఇత్యాది వాక్యాలను బట్టి నిర్ణయింపబడింది. అయితే ప్రపత్తికి ఆ అంగాలు ఆవశ్యకాలు కావు కదా! అందువల్ల **"వీడుశెయ్‌దు వీడు శెయ్‌మిన్"** ( ప్రాకృత సంగాన్ని వీడి, భగవానుని ఆశ్రయించండి) అనేవాక్యంతో **"స్నాత్వా భుంజీత"** ( స్నానం చేసిన తర్వాత భుజించాలి అని ఇక్కడ స్నానం చేయడం భోజనం చేయడానికి యోగ్యతను కల్గిస్తుంది - అనే అర్థం ఆనంతర్యాన్ని సూచించే క్త్వాప్రత్యయాంతమైన **"స్నాత్వా"** అనే పదం ద్వారా సూచింప బడింది) అనే ప్రయోగంలోవలె అంగాంగి భావం (భోజనానికి స్నానం చేయడం అంగం, ఆ విధంగానే ప్రాకృత సంగాన్న విడువడం ఆశ్రయణానికి అంగం - అనే అంగాంగి భావం) స్ఫురిస్తున్నది. కాని, ఆழ்వార్లు **"ఆతెనక్కు నిన్ పాదమే శరణాక త్తన్దొழிన్దాయ్"** ( నీ శ్రీచరణాలను ఉపాయంగా నీవే నాకు అనుగ్రహించావు ) అని, **"అడిక్కీழ் అమర్న్దు పుకున్దేనే"** (నీ పాదాల చెంత స్థిరంగా ఉండి ఆశ్రయించాను) అని ఆశ్రయించారు. ప్రపన్నజనకూటస్థులుగా ప్రసిద్ధులైన ఆழ்వార్లు ప్రపన్నులా? లేక, భక్తులా? అనే సంశయించే రీతిలో విషయాంతరరాల పట్ల గల వైరాగ్యంతో కూడిన భక్తిని **"మయర్వఅమదినమ్ అరుళినన్"** (అజ్ఞాన అన్యథా జ్యానాదులు లేనిది, భక్తిరూపాన్ని పొందినది అయిన జ్ఞానాన్ని అనుగ్రహించాడు) అని ఏ సాధనాన్ని అనుష్ఠించకుండా భగవానుడు అనుగ్రహించాడు - అని అతని కృపవల్ల పొందిన వారు కనుక, వీరి ప్రపత్తి విషయాంతరవైరాగ్యంతో కూడుకొన్నది కనుక, ఈ విధంగా వీరి ఉక్తిని, అనుష్ఠానాన్ని చూస్తే వీరి భక్తి శమదమాదులను అంగాలుగా కల్గినదై ఉంటుంది- అనే శంక కల్గుతుంది. కనుక ప్రపత్తి పరంగా అన్వయించి పలికారని భావం.

**"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** దశక వ్యాఖ్యానానికి గల అరుంబద వివరణంలో శ్రీభాష్యరచనానంతరం రామానుజులు ఈ దశకాన్ని సాధనోపాసనపరంగా అన్వయించి పలికారని ఒక యోజనాంతరం తెలుపబడింది. **"అథవా - భాష్యమ్ తలైక్కట్టిన పిన్బు - ఎన్దదుక్కు సాధనోపాసనపరమాక నిర్వహిత్తారెన్బు పొరుళ్"**

(లేక, శ్రీభాష్య రచన పూర్తి చేసిన తరువాత – అనే వాక్యానికి సాధనోపాసన పరంగా నిర్వహించారని అర్థం ) ఇత్యాదిగా ఈ నిర్వాహం చూపబడింది. తత్త్వం, హితమే కదా శాస్త్రాలలో ప్రతిపాదింపబడతాయి. ఇక్కడ హితమంటే – అలౌకిక పురుషార్థమే. అందువల్ల పురుషార్థం హితంలో అంతర్భవిస్తుంది. బ్రహ్మ మీమాంస తత్త్వాన్ని పూర్వదికంలో నిరూపించింది. హితాన్ని చివరి ద్వికంలో నిరూపించింది. ఆ రీతిలోనే ఆ*ళ్వా*ర్లు తిరువాయ్‌మొ*ళ్ళి*లో తత్త్వాన్ని **"ఉయర్వఱ"** దశకంలోను, హితాన్ని **"వీడుమిన్"** దశకంలోను నిరూపించారు. **"వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్"** అనే సూక్తి ద్వారా **"శమదమాద్యుపేతః స్యాత్"** (3–4–27) అనే సూత్రార్థం తెలుపబడింది. **"మిన్నిన్‌నిలై"** అనే పాశురంలో వైరాగ్య పాదార్థం సూచింపబడింది. **"పుల్‌కు"** (సంశ్లేషించి) అనే సూక్తి ద్వారా భగవదనుసంధానం ప్రీతిరూపమైనదని తెలుప బడింది. **"అ*ఱ్ఱ*దు ప*ఱ్ఱ*ఱనిల్"** (సంగం లేకుండా పోయిందంటే) అనే పాశురంలో **"ఉ*ఱ్ఱ*దు వీడుయిర్"** (ఆత్మ పరువదాన్ని చేరింది) అని యోగ శాస్త్రంలో చెప్పబడిన రీతిలో జ్ఞానయోగంలో ఆత్మసాక్షాత్కారం కల్గినపుడు ఆత్మ యొక్క భోగ్యత వ్యక్తమైనందున, అక్కడే దాని భోగ్యతలోనే నిలచిపోవచ్చు. ఆ విధంగా, చాలా తక్కువది అయిన ఆ కైవల్యంలో నిలచిపోకండి – అని ఉపదేశించి నందున ఈ తిరువాయ్‌మొ*ళ్ళి* ఉపాయభక్తి ప్రధానం – అని ఈ యోజన వివరింపబడింది. కాని దీనికంటే సాధ్యభక్తి పరమైన యోజనయే సరసం.

అందుచేతనే శ్రీరామానుజులు నిర్వాహాన్ని సాధన భక్తిపరంగా కాకుండా సాధ్య భక్తిపరంగా నిర్వహించడమే ఉచితం. సారంగా – జీయర్ అరుంబదంలో– ఈ పది పాశురాలలో సంగ్రహంగా ప్రపత్తి రూపం, దానికి ఉపయోగించే అంశాలు చెప్పబడినందున ప్రపత్తిలో ఈ దశకం పర్యవసిస్తున్నదని – యామునుల నిర్వాహం, ప్రాప్యమైన భగవత్ప్రాప్తి పట్ల కలుగవలసిన రుచిలో పర్యవసిస్తున్నది– అని శ్రీరామానుజుల నిర్వాహమని తెలుపబడింది.

**"శార్వే తవ నెతి"** (10–4) అనే దశకంలో కూడా **"వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్"** దశకంలోని ప్రమేయాన్ని గూర్చిన విచారాన్ని కొంత నమ్బిళ్ళై చేశారు. ప్రబంధా రంభంలో **"వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్"** దశకంలో పల్కిన అర్థాన్ని **"శార్వే తవ**

**నెతి"** దశకంలోను, **"పత్తుడై"** దశకంలోని ప్రమేయాన్ని **"కణ్ణన్‌క*ழ*లిణై"** దశకంలోను పరిసమాప్తి చేస్తున్నారని నిర్వహించారు – అని **"శార్వే తవ నెతి"** దశక ప్రవేశంలో నమ్బిళ్ళై తెలిపారు.

శ్రీరామానుజుల నిర్వాహంలో సహజంగా ఒక సందేహం కలుగవచ్చు. ఆ*ழ*్వార్లు తాము **"ఉయర్వఱ"** దశకంలో అనుష్ఠించిన ప్రపత్తిని **"వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్"**లో ఉపదేశించారని అనడం యుక్తం. ఆ విధంగా కాక, తాము **"ఉయర్వఱ"**లో ఆచరించిన ప్రపత్తిని కాకుండా సాధ్యభక్తిని **"వీడమిన్ ము*ఱ్ఱ*వుమ్"**లో ఉపదేశించారని అనడం ఏవిధంగా పొసగుతుంది? అంటే – పరభక్తి రూపమైన సాధ్య భక్తి నేది క్రమంగా ప్రపత్తిలో అన్వయింప జేస్తుంది – అనే భావంతో ఈ విధంగా అన్నారని చెప్పవచ్చు – అని అరుంబదంలో తెలుప బడింది. అంతేకాక, ముందుగా ప్రపత్తిని ఆ*ழ*్వార్లు అనుష్ఠించి, తరువాత దశకంలో ప్రాప్య రుచి రూపమైన సాధ్యభక్తిని తెలిపారు – అని తలచిన శ్రీరామానుజులు తదనుగుణంగా శరణాగతి గద్యలో ఈ క్రమాన్ని అనుసరిస్తూ పలికారని కూడా నమ్బిళ్ళై– **"ఇనిత్తాన్ ఇవర్‌వ*ழ*ియేపోయ్ ఇవరుడైయ పేఱే పేఱాక నినైత్తిరున్ద భాష్యకారరుమ్, ప్రపత్తియైప్పణ్ణి పిన్నై భక్తి తుడఙ్గి ప్రార్థిత్తాఱిరే"** ( ఇక, ఆ*ழ*్వార్ల దారిలో వర్తించి, వీరు ఆశించిన ప్రయోజనాన్నే తమకు ప్రయోజనంగా భావిచిన శ్రీరామానుజులు కూడా శరణాగతి గద్యలో ముందు ప్రపత్తి చేసి, తరువాత భక్తిని మొదలుకొని అర్థించారు ) అని **"శార్వే తవ నెతి"** దశక ప్రవేశంలో తెలిపారు. శరణాగతి గద్యలో శ్రీరామానుజులు **"శ్రీమన్ నారాయణ! తవ చరణార విందయుగళం శరణ మహం ప్రపద్యే"** అని ప్రపత్తి చేసిన తరువాత **"స్థాన త్రయోదితపరభక్తియుక్తం మాం కురుష్వ"** అని, **"పరభక్తిపరజ్ఞానపరమభక్త్యై కస్వభావం మాం కురుష్వ"** ఇత్యాదిగా ప్రార్థించారు కదా! అందువల్ల **"వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్"** దశకంలో పరభక్తి పరజ్ఞాన పరమభక్తి రూపమైన సాధ్యభక్తి ఉపదేశింపబడింది– అని శ్రీరామానుజుల నిర్వాహమని పైన ఉదాహరించిన నమ్బిళ్ళై సూక్తివల్ల తెలుస్తున్నది. కనుక రామానుజులు సాధన భక్తి రూపమైన నిర్వాహం చేశారని అనడం కంటే, సాధ్య భక్తి రూపమైన నిర్వాహం చేశారని అనడమే యుక్తం.

## ప్రపన్నుడు శరీర విమోచన కాలాన్ని ఎదురుచూడాలి

### 3) 1-2-9 - ఈడు వ్యాఖ్యానమ్

**"ఓర్ అయనత్తినన్ఱు కున్తత్తు జీయర్ ఎమ్బెరుమానార్ శ్రీపాదత్తిలే పుక, అవరుడైయ శిఱు పెయరై చ్చొల్లి, 'శిఱ్ఱప్పిరాన్! ఇన్ఱు అయనమ్ కిడాయ్!' - ఎన్న, తిరువుళ్ళత్తిల్ ఓడుకిఱదు ఇన్నదు ఎన్ఱు అఱియామైయాలే అవర్ పేశాదిరుక్క, "ఇద్దేహసమనంతరత్తిలే ప్రాప్తి కణ్ణఴివఱ్ఱ పిన్బు, నడువు విరోధియాక శెల్లుకిఱ నాళిలే ఓరాణ్డు కఴియప్పెఱ్ఱ ఇదు, ఉనక్కు ఒన్ఱాయ్ ఇరున్దదిల్లైయో?" ఎన్ఱరుళి చ్చెయ్దార్".**

(ఒక ఆయన పుణ్యకాలంనాడు కున్తత్తు జీయర్ అనేవారు శ్రీరామానుజుల సన్నిధికి వెళ్ళారు. వారిని, వారి చిన్న పేరును పెట్టి పిల్చి పల్కుతూ శ్రీరామానుజులు- "శిఱ్ఱప్పిరాన్! ఈనాడు అయనం సుమా!" అని అన్నారు. శ్రీరామానుజుల మనస్సులోని అభిప్రాయం "ఇది" అని స్పష్టంగా తెలియనందున శిఱ్ఱప్పిరాన్ మౌనంగా ఉండిపోయారు. అపుడు శ్రీరామానుజులు మళ్ళీ - "ఈ దేహం పతనమైన పిమ్మట మోక్షప్రాప్తి లోటు లేకుండా ఉన్నపుడు, ఆ ప్రాప్తికి మధ్యలో అడ్డంగా ఉండే కాలంలో ఒక సంవత్సరం గడచిపోవడమనే ఇది నీకు ఒక గొప్ప విషయంగా తోచలేదా?" అని అన్నారు)

తిరువాయ్మొఴిలోని **"వీడుమిన్ ముఱ్ఱవుమ్"** అనే దశకంలోని 9వ పాశురంలో ఆఴ్వార్లు **"ఒడుఙ్గ అవన్ ఒడుఙ్గలుమెల్లామ్ విడుమ్, పిన్నుమ్ ఆక్కై విడుమ్ పొழுదు ఎణ్ణే!"** (ప్రకారభూతులైన మీరు భగవంతుని ఆశ్రయిస్తే, అప్రాప్తమైనవి అన్నీ తీరిపోతాయి. తరువాత ఇక శరీరపతనసమయంకోసం ఎదురు చూస్తూ ఉండండి) అని పరోపదేశం చేశారు. ఈ పాశురానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే నమ్బిళ్లై శ్రీరామానుజులకు చెందిన ఈ క్రింది ఐతిహ్యాన్ని ఉదాహ రించారు. (ఈ ఐతిహ్యం ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో కూడా ఉన్నది)

ఒక ఆయన పుణ్యకాలంనాడు **"కున్తత్తు జీయర్"** అనే శ్రీరామానుజుల శిష్యులొకరు వారి దగ్గరకు వచ్చారు. వారి ముద్దుపేరు శిఱ్ఱప్పెరుమాళ్. ఆ పేరుతో వారిని సంబోధిస్తూ శ్రీరామానుజులు - "శిఱ్ఱప్పిరాన్! ఈనాడు అయనం కదా!" అని అన్నారు. సాభిప్రాయంగా పల్కిన ఈ మాటలోని తాత్పర్యాన్ని ఇదమిత్థంగా

తెలియనందున శిఙ్గప్పిరాన్ మౌనంగా ఉండిపోయారు. వారి స్థితిని గమనించిన శ్రీరామానుజులు "ఆత్మ, ఈ శరీరం వీడి వెలువడిన పిమ్మట మనకు పరమపదప్రాప్తి కల్గడం తథ్యం. అయితే, ఆ ప్రాప్తిని ఇపుడే పొందడానికి అంతరాయంగా ఉండే కాలంలో ఒక సంవత్సరం గడచిపోవడమనేది నీకొక మంచి విషయంగా తోచలేదా?" అని అన్నారట.

**"ప్రాయశః పాపకారిత్వాత్ మృత్యో రుద్విజతే జనః, కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్"** (సాధారణంగా మానవులు పాపం చేసినందున మృత్యువుకు భయపడతారు. కాని, కృతకృత్యులు మాత్రం మృత్యువు కోసం ప్రియమైన అతిథికోసంవలె ఎదురుచూస్తారు) అనేవిధంగా దేహావసానంకోసం ఎదురు చూడడం కృతార్థులకు భయకరం కాదు; సరికదా ప్రీతికరం. ఇక కృత కృత్యులెవరు? అంటే **"విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే, తేషాం రాజన్! సర్వయజ్ఞా స్సమాప్తాః"** (రాజా! ఏ బ్రాహ్మణులు – అంటే – జ్ఞానులు – శ్రీకృష్ణుని యథాతథంగా – అంటే – మోక్షోపాయంగాను, మోక్షోపేయంగాను నమ్ముతారో, వారి అన్ని యజ్ఞాలు పూర్తి అయినట్లే) అనే ప్రమాణాన్నిబట్టి పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుని ఉపాయంగా, ఉపేయంగా అధ్యవసించినవారే కదా!

ఈ ఐతిహ్యంద్వారా గతిచింతనంకూడా ప్రాప్యకోటిలోనికి చేరుతుందని తెలుపబడింది. శ్రీరామానుజులు వైకుంఠగద్యలో, శ్రీవాత్స్యవరదగురువు శ్లోక ద్వయంలో శ్రీదేశికులు గతిచింతనాధికారంలో, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అర్చిరాదిలో వివరంగా గతిచింతనను గూర్చి తెలిపారు. బ్రహ్మసూత్రాలలోని ఉత్క్రాంతి పాదంలో ఈ గతిచింతనమే కదా చేయబడింది. షడ్రసోపేతమైన భోజనాన్ని భుజించినపుడు కల్గిన ఆనందం కంటే, ఆ విందును గూర్చి ముందుగా భావించినపుడు కలిగే అనుభూతి విలక్షణం కదా!

## భగవానుని సౌలభ్యం

## 4) 1-3 – ఈడు వ్యాఖ్యాన ప్రవేశమ్

**"సర్వేశ్వరన్ అరియన్ ఎన్నాల్ సంసారత్తిల్ ఆళ్ పఱ్ఱాదు – ఎన్ఱు అవన్ ఎళిమైయై ఉపపాదిత్తుక్కొణ్డు పోన్దోమ్. అదుదానే అవర్కళుక్కు "ఇత్తనై ఎళియనో!"**

**ఎన్ఱు విడుకైక్కు ఉడలాయిఱ్ఱు. అవ్వెళిమైదానే ఆదరిక్కైక్కు ఉడలాయిఱ్ఱు, ఉమక్కు ఒరువర్క్కుమేయిఱే!" ఎన్ఱు ఎమ్బారై ప్పార్త్తు ఉడైయవర్ అరుళిచ్చెయ్‌దరుళినార్".**

(భగవంతుడు దుర్లభుడని అంటే, సంసారంలో అతనిని కొలిచే వారుండరు – అని తలచి అతని సౌలభ్యగుణాన్ని ప్రతిపాదించాము. ఆ గుణమే వారికి "ఇతడు ఇంత సులభుడా!" అని అతనిని విడచిపెట్టడానికి హేతువు అయినది. ఆ సౌలభ్యమే మీకొక్కరికే కదా ఆదరించడానికి కారణమైనది" అని ఎమ్బార్‌ను చూచి శ్రీరామానుజులు అన్నారు)

నమ్మాళ్వార్లు **"పత్తుడై అడియవర్క్కు ఎళియవన్"** (భక్తి కలవారికి భగవానుడు సులభుడు" అని ఆరంభమయే ప్రథమ శతకం మూడవ తిరువాయ్ మొళి (దశకంలో) భగవానుడు చాలా సౌలభ్యాన్ని కలవాడు – అని తెలిపారు. ఈ సందర్భాన్ని వివరించే నమ్బిళ్ళై తమ ఈడువ్యాఖ్యలో భగవద్రామానుజులకు, ఎమ్బార్‌కు సంబంధించిన ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావించారు.

ఒకనాడు భగవద్రామానుజులు భగవానుని పరత్వగుణం నుండి సౌలభ్యం వరకు గల అన్ని గుణాలను వివరిస్తూ ఉపన్యసించారు. దానిని ఆలకించిన ఎమ్బార్‌కు భావావేశంవల్ల కంటి నిండుగా ఆనందబాష్పాలు స్రవించాయి. వారి మనస్సు చాలా ఆర్ద్రమైనది. వారిని ఆ సన్నివేశంలో గమనించిన శ్రీరామానుజులు. "సర్వస్మాత్‌పరుడైన భగవానుడు తన పరత్వాన్ని ప్రదర్శించకుండా చాలా కిందకు దిగి వచ్చి, **"నిషాదానాం నేతా కపికులపతిః కాపి శబరీ కుచేలః కుబ్జా సా వ్రజయువతయో మాల్యకృదితిః"** (వ్యాధప్రభువైన గుహుడు, వానరాజు సుగ్రీవుడు, జాతివల్ల తక్కువది అయిన శబరి, ధనహీనుడైన కుచేలుడు, అంగవైకల్యంతో కురూపి అయిన కుబ్జ, చాలా తక్కువవాడైన మాలాకారుడు) అనే రీతిలో చాలా అధములు కూడా దర్శించి ఆనందించేటట్లు అవతారాలలో తన సౌలభ్యగుణాన్ని ప్రదర్శించాడు. దీనిని చూచి లోకంలోనివారు "ఇతడు ఇంత తక్కువవాడు" అని తలచి, అతనిని లెక్కించకుండా, అలక్ష్యం చేసి నశించిపోయారు. వారి అదృష్టంలోపం వల్ల సౌలభ్యమే నశించడానికి హేతువైనది. అయితే, "చాలా గొప్పవాడైన భగవానుడు తనను మనకోసం ఈ విధంగా కిందకు దిగి వచ్చి, దర్శనమిచ్చి, తన సౌలభ్యాన్ని

ప్రదర్శించాడే. ఇది ఎంత గొప్పగుణం!" అని అభినివేశాన్ని పొంది ద్రవించేవారికి ఆ సౌలభ్యగుణమే తరించడానికి వారి భాగ్యాతిశయం వల్ల కారణమైనది. (అని శ్రీరామానుజుల సూక్తి తాత్పర్యం)

ఈ సందర్భాన్ని అరుంబదకారులు భాగ్యాతిశయాన్ని కలవారు సౌలభ్య గుణాన్ని గుర్తించి తరిస్తారని, భాగ్యహీనులు దీనిని గుర్తించలేక నశిస్తారని అంటూ భగవానుడే స్వయంగా భగవద్గీతలో పల్కిన ఈ విషయాన్ని ప్రస్తావించారు. **"అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్, పరం భావ మజానంతః"** (మానవరూపాన్ని ఎత్తిన నాలోని పరత్వాన్ని గమనించలేని మూఢులు నన్ను తక్కువగా భావిస్తున్నారు) అని లోకంలో కొందఱు తన పరత్వాన్ని తక్కువగా తలచి, నశించడానికి, **"మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః, భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్"** (మహాత్ములు సాత్త్వికస్వభావాన్ని కలవారై, నన్ను భూతాలకు ఆదిగా, అవ్యయునిగా గ్రహించి, అనన్యమైన మనస్సుతో భజిస్తున్నారు) అనేవిధంగా కొందఱు అనుకూలంగా భావించి తరించడానికి ఏమి కారణం? అంటే, **"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః, మాయాయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః"** (చెడ్డకర్మలను చేసిన మూఢులైన నరాధములు మాయచేత జ్ఞానాన్ని కోల్పోయినవారై, ఆసురస్వభావాన్ని పొంది నన్ను ఆశ్రయించారు) అనేవిధంగా వారి భాగ్యహానివల్ల కొందఱు భగవానుని పరత్వాన్ని గుర్తించలేక నశిస్తారని, **"యేషాం త్వంతగతం పాపం నరాణాం పుణ్య కర్మణామ్, తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః"** (పుణ్యాలుచేసినవారై, అందువల్ల పాపఫలాన్ని తీరినవారై నరులు కామక్రోధాలు లేనివారై, నన్ను దృఢంగా ఆశ్రయిస్తారు) అనేవిధంగా కొందఱు పుణ్యాత్ముల పాపం నశించినందున, వారు ద్వంద్వాతీతులై, మోహాన్ని పొందక, నన్ను దృఢంగా కొలుస్తారని అన్నాడని తెలిపారు. ఇదే భావాన్ని ప్రకృతమైన ఐతిహ్యాన్ని వివరించడానికి ముందు నంబిళ్ళైకూడా – **"అవతారమ్ తన్నిల్ వన్దాల్ భాగ్యహీనర్క్కు సజాతీయ ప్రతిపత్తిపణ్ణి అనర్థప్పట్టు పోకవుమామ్, భాగ్యాధికర్క్కు "అరియన్ ఎళియనాక ప్పెఱ్ఱోమే!" ఎన్ఱు ఆశ్రయిక్కలామ్బడి ఇరణ్డుక్కుమ్ పొదువాయితే ఇరుప్పదు"** (అవతారంలో అయితే, భాగ్యం లేనివారు భగవానునితో

వలె సామాన్యునిగా తలచి నశించేటట్లు, గొప్ప భాగ్యం కలవారు. “ఎవరికీ అందనివాడు సులభుడయ్యాడు కదా! అని ఆశ్రయించే టట్లు– ఈ విధంగా ఆశ్రయించడానికి, విడువడానికి సౌలభ్యం సమానంగా ఉంటుంది) అని అన్నారు.

ఈ ఐతిహ్యాన్నే నాచ్చియార్ తిరుమొழி ప్రబంధంలోని **“ఎప్పొరుట్కుమ్ నిన్ఱు”** (11–6) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై ప్రస్తావించారు. అందులో శ్రీరామానుజుల పేరు శబ్దతః నిర్దేశింపబడలేదు. కాని, నమ్బిళ్ళై ఈడులో వారి నామనిర్దేశం చేయబడింది.

## రామానుజుల నిర్వాహంలోని ప్రకరణౌచిత్యం

### 5) 1-4-3 – ఈడు వ్యాఖ్యానమ్

**(కళ్వర్క్కు) – “వంచకర్క్కు” ఎన్ఱు తిరుమాలైయాణ్డాన్ నిర్వహిక్కుమ్బడి. ఎమ్బెరుమానార్ “ఒన్ఱై నినైత్తు ఒన్ఱై చ్చెయ్‌దవర్క్కు” ఎన్ఱు అరుళిచ్చెయ్‌వర్.**

( **కళ్వర్క్కు** ) – ఈ పదానికి – **“వంచకునకు”** – అని తిరుమాలైయాణ్డాన్ అనే ఆచార్యులు అర్థాన్ని నిర్వహించేవారు. శ్రీరామానుజులు – “ఒకటి తలచి, ఇంకొకటిని చేసేవానికి” అని అర్థాన్ని చెప్పారు.)

విరహార్తితో నాయకీదశను పొందిన ఆழ்వార్లు భగవానుని దగ్గరకు పక్షులను దూతలుగా పంపుతూ **“మదియినాల్ కుఱళ్‌మాణాయ్ ఉలకిరన్ద కళ్వర్క్కు”** (ఉపాయంతో వామనబ్రహ్మచారియై లోకాన్ని యాచించిన కృత్రిమ వ్యాపార శీలునకు నా వార్తను తెలుపండి) – అని అన్నారు. ఇక్కడ **“కళ్వర్క్కు”** అనే పదాన్ని వివరిస్తూ, తిరుమాలైయాణ్డాన్, శ్రీరామానుజులు – అనే ఇద్దరు ఆచార్యులు చేసిన అర్థనిర్వాహాలను నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యలో ప్రస్తావించారు.

**“ఉలకిరన్ద కళ్వర్క్కు”** అనే ప్రయోగాన్ని తిరుమాలై యణ్డాన్ – **“కొళ్వన్ నాన్”** అని ముద్దుగా తీయని మాటలను పల్కి, మహాబలిని నోరు మూయించి, అతనిని వంచించి, చిన్న రూపంతో మూడడుగులు యాచించి, పెద్దరూపంతో లోకాలను కొలిచి – ఈ విధంగా వంచనలను చేయాలని మనస్సులో తలచి” – అని వివరించారు. తిరుమాలైయాణ్డాన్ చూపిన ఈ నిర్వాహం ఆళవందార్ పల్కిన

నిర్వాహంగా భావించవచ్చు. ఈ అర్థనిర్వాహం వామనావతారాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని చేయబడింది.

భగవద్రామానుజులు ఇంకొక, మధురమైన, ప్రకృత ప్రకరణానుగుణమైన అర్థనిర్వాహాన్ని చేశారు. ఇక్కడ ప్రకరణం – పరాంకుశ నాయకి తన విరహార్తిని తెలుపడమే కదా! **"ఒన్టై నినైత్తు ఒన్టై చ్చెయ్‌దవర్‌క్కు"** (మనస్సులో ఒక ఉద్దేశ్యాన్ని పెట్టుకొని, వేఱొక కార్యాన్ని చేసినవానికి) అనేది శ్రీరామానుజుల నిర్వాహం. ఆనాడు ఇంద్రునకు సహాయ పడడంకూడా అతనిని రక్షించడంకోసం కాదు సుమా. ఆనాడు స్వామి తాను వామనావతారాన్ని ఎత్తి చాతుర్యంతో ముద్దుమాటలను పల్కి, మహాబలిని వశీకరించుకొని, ఉపాయంతో తరువాత త్రివిక్రమరూపంతో లోకాలను కొలిచి ఇంద్రుని రక్షించడం అంతా – ఇపుడు నేను ఆ కృత్యాలను భావించి, స్మరించి మోసపోవడంకోసమే" అనే భావంతో ఆழ்్వార్లు **"ఉలకిరన్ద కళ్వర్‌క్కు"** అని ప్రయోగించారు – అనేది శ్రీరామానుజుల నిర్వాహంలోని తాత్పర్యం. ఈ నిర్వాహం కేవలం వామనావతారాన్ని దృష్టిలో పెట్టుకొని చేయడం కాకుండా, ప్రకృత ప్రకరణానికికూడా అన్వయించి చేయబడింది. చాలా దీర్ఘదర్శిత్వాన్ని కల స్వామి "భవిష్యత్తులో పరాంకుశనాయకి నా సంశ్లేషాన్ని కోరుతుంది. ఇపుడు నేనీ అద్భుత లీలను చేస్తే, దీనిని ఆ నాయకి మనస్సులో సాక్షాత్కరింపజేసికొని నన్ను నమ్ముతుంది. ఆ విధంగా పరాంకుశనాయకిని వంచించడానికి, వశీకరించుకోవ డానికి ఈ లీల ఉపయోగిస్తుం"దనే భావనతోనే ఈ లీలను చేశాడు – అనేది **"కళ్వర్‌క్కు"** అని పల్కిన నాయకి మనస్సులోని అభిప్రాయం – అనేది శ్రీరామానుజుల నిర్వాహతాత్పర్యం.

ఈ విధంగా పరాంకుశనాయకి (నమ్మాழ்్వార్లు) వామన – త్రివిక్రమ వృత్తాంతాలలో అభినివేశాన్ని పొందిందా? అంటే **"పెరు నిలమ్ కడన్ద నల్లడిప్పోదు అయర్ప్పిలన్ అలఱ్ఱువన్ తழ்ువువన్ వణఙ్గువన్"** (మహాపృథివిని కొలిచిన, ఆశపడదగిన స్వామి శ్రీచరణాలను మఱువను, పారవశ్యంతో స్తుతిస్తాను. ఆలింగనం చేసికొంటాను, వాటికి నమస్కరిస్తాను) అనికదా త్రివిక్రమ శ్రీచరణాలనుగూర్చి ఆழ்్వార్లు ఆశపడ్డారు. ఇంతే కాక, **"ఉలకమ్ కొణ్డ వడియన్ అఱివరు మేని మాయత్తన్, ఆకిలుమ్ అవనెన్టే కిడక్కుమ్"** (లోకం అంతా తనదే అయే రీతిలో,

ఎదుటివానికి ఏమీ మిగల్చకుండా, అంతా స్వాధీనం చేసికొని, తన పాదాల చెంత నిలుపుకొనే వంచకుడై, "స్వచ్ఛమైనవాడు, కృత్రిమ స్వభావుడు కాదు" అని ఆ వంచనను వివేకించి తెలిసికోవడానికి సాధ్యం కానట్లుగా తన అందంతో కళ్ళు కప్పి, వ్యామోహపరచే ఆశ్చర్యచేష్టితుడైనా, "లోకమర్యాదకు ఇది తగదు సుమా! ఈ వంచకుని కోరడం తగదు, విరమించు" అని ఎవరు పల్కినా, మనస్సును మార్చడానికి వీలు కాని రీతిలో, నా పాపిష్ఠి మనస్సు, పూర్వోక్త వంచన స్వభావ విశేషాలను కల ఆ త్రివిక్రమునే శరణుగా నమ్ముతున్నది) అని, **"అన్టారు కాల్ వైయ మళన్ద పిరాన్ వారానెన్టు ఒరు కాల్ శొల్లాదులకు"** (మహాబలి భూమిని అపహరించిన ఆ సమయంలో భూమిని స్వాధీనం చేసికొని కొలిచిన లోకోపకారకుడు ఎపుడు వస్తాడో కదా! – అని ఏనాడూ ఒక మాటను పలుకకుండా లోకం నిద్రపోతున్నదే!) అని కదా పరాంకుశనాయకి ఈ అవతారలీలలో పలుమార్లు అభినివేశాన్ని పొందింది. ఇటువంటి ఆళ్వార్ల శ్రీసూక్తులను, ప్రకృతప్రకరణాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీరామానుజులు చేసిన అర్థనిర్వాహం ఎంతో మధురమైనది కదా! ఈ నిర్వాహాన్ని ఇరుపత్తు నాలాయిరప్పడిలో కూడా పెరియవాచ్చాన్ పిళ్ళై – **"అప్పడిప్పట్ట వంచకర్క్కు – ఎన్బర్ ఆళవందార్". "అన్టు అచ్చెయల్ శెయదదుమ్ అగ్గుణచేష్టితజ్గళాలే ఎన్నెజ్జై అపహరిత్తు ఈడుపడుత్తుక్కాక విఱే" – ఎన్బర్, ఎమ్బెరుమానార్"** (అటు వంటి వంచకునకు – అని ఆళవందార్ అర్థం చెప్పారు. "ఆనాడు ఆ లీల చేసినది అంతా ఆ గుణాలతో, లీలలతో నా మనస్సును దోచి, అభినివేశాన్ని పొందించడం కోసమే కదా!" అని శ్రీరామానుజులన్నారు) అని ప్రస్తావించారు.

ఈ రీతిలో నమ్మాళ్వార్లే కాక, తిరుమంగైమన్నన్ కూడా **"మున్నమ్ కుఱళురువాయ్ మూవడి మణ్ కొణ్డళన్ద మన్నన్ శరితైక్కే మాలాకి ప్పొన్ పయన్దేన్"** (పూర్వం ఒకానొక సమయంలో వామనరూపాన్ని దాల్చి, మూడుగుల నేలను అర్థించి, ఆ త్రివిక్రమరూపంతో లోకాలను కొలిచిన రాజాధిరాజైన అతని లీలలో వ్యామోహాన్ని పొంది నేను నా శరీర లావణ్యాన్ని కోల్పోయాను) అని అంటూ పెరియతిరుమొళి ప్రబంధంలో ఈ అవతార లీలలో అభినివేశాన్ని పొందారు. ఆళ్వార్ల సూక్తులలోని ఈ విధమైన ఐకకంఠ్యం కూడా శ్రీరామానుజుల నిర్వాహానికి

దోహదం చేసి ఉండవచ్చు. నమ్మాழ்వార్ల సూక్తులను తిరుమంగైమన్నన్ సూక్తులు ఉపబృంహణాలే కదా?

**"గుణచేష్టితఙ్గళాలే ఈడుపడుత్తుమ్ స్వభావనుక్కు"** (తన గుణాలతో, లీలలతో అభినివేశాన్ని కల్గించే స్వభావం కలవానికి) అని ఒన్పది నాయిరప్పడిలో, **"ఇరన్దు శిఱుకాలై క్కాట్టి పెరుకాలాలే అళన్దు కొణ్డకణక్కిలే తాழ நిన్ఱు కలన్దు ఎట్టాదు నిన్ఱ కృత్రిమనుక్కు"** (యాచించి, చిన్న పాదాన్ని చూపి, పెద్ద పాదంతో కొలిచిన రీతిలో, సులభుడై నిలచి సంశ్లేషించి, దుర్లభుడై ఉండే మోసగానికి) అని పన్నీరాయిరప్పడిలో, **"తన్నుడైయ దివ్యచేష్టితఙ్గళాలే ఎన్నై త్తోత్పిత్తవనుక్కు"** (తన దివ్య లీలలతో నన్ను జయించిన వానికి) అని ఆఱాయిరప్పడిలో శ్రీరామానుజ నిర్వాహానికి అనుగుణం గానే వివరింపబడింది.

## భగవద్విశ్లేష క్లేషాన్ని అధికం చేసే చీకటి

## 6) 2-1-7 ఈడు వ్యాఖ్యానమ్

**(తోற்றோమ్ - ఇత్యాది) - కీழும், మేలుమ్ పోరుకిఅపడి యొழிయ, శబ్దస్వారస్యత్తై ప్పற்ற ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌దు పోరువదు ఒన్ఱుణ్ణు. అమ్మఙ్గి యమ్మాళుమ్ అత్తైయే నిర్బంధిత్తుప్పోరుమ్. అదాకిఅదు - తాన్ పిఱివాற்றாదాల్ అనేకర్ కూడ క్కట్టిక్కొణ్ణు కూప్పిడా నిఱ్క, ఇరుళ్ వన్దు ముకత్తై మఱైక్క, అత్తై ప్పార్‌త్తు "ఆற்றாమైక్కు ప్పోక్కు విట్టు ధరిక్క వొట్టాదే నీ వన్దు నలియక్కడవయో!- ఎన్గిఱాళ్"**

( ముందు వెనుకలలో ఉండే శబ్దప్రయోగాలు అటు ఉండగా, శబ్ద స్వారస్యాన్ని బట్టి శ్రీరామానుజులు పలికే అర్థం ఒకటి ఉన్నది. అమ్మఙ్గియమ్మళ్ అనే ఆచార్యులు కూడా దానినే గట్టిగా చెప్పేవారు.ఆ అర్థం ఏమంటే - "పరాంకుశ నాయకి, తనవలె విశ్లేషాన్ని గ్రహించలేని పలువురను తనతో కలుపుకొని ఆక్రందిస్తూ ఉండగా, ఇంతలో చీకటి వచ్చి వారి ముఖాలను పరస్పరం కనపడనీయకుండా మఱుగు పరచింది. దానిని చూచి, "ఆర్తిని ఒకరితో ఇంకొకరు చెప్పుకొని వ్యక్తం చేసి ప్రాణాలను నిలుపుకోనీయ కుండా నీవు వచ్చి మమ్ములను ఈ విధంగా బాధించడం తగునా?" - అని ఆ నాయకి పల్కుతున్నది - అనేది శ్రీరామానుజులు పల్కిన అర్థం.)

భగవత్సంశ్లేషాన్ని పొంది ఆనందించాలని ఆశపడిన ఆళ్వార్లు, అది లభించనందున చాలా క్లేశపడ్డారు. ఆర్తి అతిశయించగా పరాంకుశనాయకీ దశను పొందారు. తమ కంటికి కన్పించే వస్తువులకు గల స్వభావాలను అవి వాటికి సహజంగా ఉండే స్వభావాలని భావించకుండా, అవికూడా తమవలెనే భగవద్విశ్లేషం వల్ల కల్గిన క్లేశంతో బాధపడుతున్నట్లు భావించి, వాటికోసం క్లేశపడుతూ ఈ దశకంలో ఆళ్వార్లు పల్కుతున్నారు. తమ కంటి ముందు కన్పించిన ఒక నార పక్షి (నీటికొంగ) చూచి, దాని శరీరంలో సహజంగా ఉంటే తెల్లదనాన్ని అది తమవలె భగవద్విరహంవల్ల బాధపడుతున్నందున ఏర్పడినదని భావించి, "అయ్యో! ఓ కొంగా! నీవుకూడా నావలె భగవానుని ఆశించి, పొందలేక ఈవిధంగా వైవర్ణ్యాన్ని పొందావా?" అని ప్రశ్నించారు. ఈ రీతిలోనే మిగిలిన అన్ని పాశురాలలోను ఆళ్వార్లు తమ కంటికి గోచరించిన వస్తువులలోని విశేషాలను భగవద్విశ్లేష హేతుకాలుగా తలచి పల్కడం గమనించవచ్చు. ప్రకృతపాశురంలో కూడా చీకటిని చూచి అది దట్టంగా, కాంతివిహీనంగా ఉండడం దాని సహజ స్వభావమని భావించకుండా, భగవద్విరహం వల్ల కల్గినదని, బాధపడుతున్నదని తలచి, "నీ దుఃఖం చాలా గాఢంగా ఉన్నదే!" – అని ఆళ్వార్లు పల్కుతున్నారు – అనేది పూర్వాచార్య నిర్వాహం.

శ్రీరామానుజులు ఈ పాశురంలోని **"వేఱ్ఱార్ వకైయిల్ కొడిదాయ్"** (శత్రువుల వలె కఠినస్వభావాన్ని కల్గినదానవై) అనే ప్రయోగస్వారస్యాన్ని, **"నడువే"** (మధ్యలో) అనే పదప్రయోగస్వారస్యాన్ని దృష్టిలో పెట్టుకొని, ఒక రస్యమైన అర్థనిర్వాహాన్ని చేశారు. తాము, భగవద్విశ్లేష క్లేశాతిశయాన్ని తాళలేని పలువురు కలిసి పరస్పరం తమ హృదయాలలోని బాధను ఒకరినొకరు చూచుకుంటూ, వ్యక్తం చేసికొనే క్షణంలో, సాయంకాల సమయం పూర్తి అయినందున దట్టమైన చీకటి వచ్చి కమ్మి, ఒకరి ముఖం ఇంకొకరికి కన్పించకుండా చేసింది. అపుడు ఆళ్వార్లు చీకటిని చూచి "స్వామి విశ్లేష వ్యసనాన్ని మేము ఒకరితో ఇంకొకరు పంచుకొని ఏదార్పును పొందనీయకుండా నీవు అడ్డుపడి ఈ విధంగా మమ్ములను బాధిస్తున్నావే!" – అని పల్కుతున్నారని శ్రీరామానుజులు పల్కిన నిర్వాహం. దీనిని అనుసరించే నమ్బిళ్ళై వ్యాఖ్యానించారు.

ఈ విధంగా పూర్వోత్తర గాథలలోవలె కాకుండా, విలక్షణమైన రీతిలో ఈ పాశురాన్ని అన్వయించి అర్థాన్ని పల్కడానికి కారణం – ఈ పాశురంలో చీకటి యొక్క భగవద్విశ్లేష వ్యసనాన్ని సూచించే ఏ పదం లేకపోవడమే. అందువల్ల ఈ పాశురం శ్రీరామానుజులు చూపిన నిర్వాహంలోనే మిక్కిలి సారస్యం ఉంది – అనే విషయం గమనార్హం. ముందు పాశురంలో **"తిరుమాలాల్ నెఞ్జమ్ కోట్పట్టాయే"** (శ్రియఃపతికి నీ మనస్సు కోల్పోయావా?), **"అరవణైయాన్ తు*ழ*ాయ్ తామమ్ ము*ఱ్ఱా*యే"** (శేషశాయి తులసీమాలను ఆశపడ్డావా?) **"యామ్ ఉ*ఱ్ఱ*దు ఉ*ఱ్ఱా*యో?"** (మేము ఆశపడినదే ఆశపడ్డావా?) ఇత్యాదిగా ఆయా పదార్థాలు భగవానుని ఆశపడి క్లేశాన్ని పొందుతున్నవి – అనే అర్థాన్ని తెలిపే పదప్రయోగా లుండడం గమనించాలి. ఈ పాశురంలో ఆవిధంగా లేనందువల్ల, పాశురంలోని పదప్రయోగ క్రమానుసారంగా శ్రీరామానుజులు అర్థనిర్వాహం చేసినందున వారి నిర్వాహంలో స్వారస్యం మెండు. ఈ నిర్వాహంలో **"నడువే"** అంటే – అడ్డుగా – అని అర్థం. నీవు గాఢంగా వ్యాపింది అడ్డుపడి ముముఖాలను ఒకరి కొకరు కన్పించ నీయకుండా చేసి, మేము ఓదార్పును పొందకుండా చేసి, శత్రువులు బాధించే దానికంటే ఎక్కువగా మమ్ములను బాధిస్తున్నావే! – అని శ్రీరామానుజుల నిర్వాహ తాత్పర్యం. ఇందులో **"కనైయిరుళే"** అనే పదానికి – కోపించిన – మాపై కోపించిన అంధకారమా! – అని అర్థం. **"వే*ఱ్ఱో*ర్ వకైయిల్ కొడిదాయ్"** – అనే ప్రయోగానికి– "శత్రువులు ప్రకారాల కంటే – కొంత దయను చూపిస్తూ హింసించే శత్రువులు, ఏమాత్రం కరుణ చూపకుండా బాధించే శత్రువులు – అనే రెండు విధాలైన శత్రువుల రీతికంటే కఠినమైనదానవై – అని అర్థం". **"వే*ఱ్ఱో*ర్ వకైయిల్"** అనే దానిని సప్తమ్యంతంగా గ్రహించి శత్రువుల రీతిలో కఠినమై అనే అర్థాన్ని చెప్పే అవకాశం ఉన్నా, దానికంటే, పంచమ్యంతంగా గ్రహించి, "శత్రువుల కంటే కఠనమై" అనే అర్థాన్ని చెప్పడంలో అంధకారానికి గల కాఠిన్యాతిశయం స్ఫురిస్తుంది కనుక, ఆ అర్థమే గ్రహింపబడింది.

పూర్వుల అర్థ నిర్వాహమంటే ఆళవందార్ నిర్వాహమే కదా! ఈ నిర్వాహ ప్రకారాన్ని నమ్పిళ్ళై చివరలో ఈ రీతిలో ప్రస్తావించారు. **"అన్ఱియే, ప్రకరణత్తోడే శేర్న్ద పొరుళావదు – తమస్సెన్ఱు ఒరుపదార్థమాయ్, "అదు దాన్ ఒళి మ*ழு*ంఙ్గి**

**యదజ్గీ యిరుక్కై స్వభావమ్" ఎన్ఱతియాదే, అభిమత విశ్లేషత్తాలే ఒళిముழுఙ్గీ, వాయ్‌విట్టుక్కూప్పిడవుమ్ మాట్టాదే, నోవుపడుకిఱ పడియై క్కణ్డు "ఉన్నిழுవు కనత్తిరున్దదీ!" ఎన్గిఱాళ్. వకుత్త విషయత్తిలే నామెల్లమ్ నెఞ్జ్ழுన్దు కూప్పిడానిఱ్క, నీ యున్నార్ద్రామైయై క్కాట్టి నలియానిన్ఱాయ్! ఉన్ అవసాదమ్ నీఙ్గి జీవిత్తిడుక"**– ఎన్ఱిఱాళ్ (లేక, ప్రకరణానికి తగిన అర్థమేమంటే – తమస్సు అనేది ఒక పదార్థం, దానికి కాంతిహీనంగా, దట్టంగా ఉండడం స్వభావమని తెలియక, తమవలె అభిమతాన్ని విశ్లేషించినందున కాంతి లేనిదై, నోరుతెరచి ఆక్రందించలేక, బాధపడతున్న రీతిని చూచి, "నీ క్లేశం చాలా గాఢంగా ఉన్నదే!" – అని పరాంకుశ నాయకి పల్కుతున్నది. "ప్రాప్తవిషయమైన భగవానుని పొందలేక మేమంతా మనస్సు పోగొట్టుకొని, ఆక్రందిస్తూ ఉండగా, నీవు నీ ఆర్తిని వ్యక్తం చేస్తూ మమ్ములను బాధిస్తున్నావే! నీ దుఃఖం తీరి, నీవు ఉజ్జీవించాలి" – అని పరాంకుశనాయకి పల్కుతున్నది) అనేది ఆళవందార్ నిర్వాహం.

ఈ అర్థనిర్వాహంలో – **"నడువే"** అంటే – నారై, కడల్, చల్లగాలి మొదలైన వాని మధ్యలో, వానితోపాటు – అని అర్థం. అంటే – నారై, కడల్ మొదలైనవి వలె నీ వ్యసనాన్ని చూపి, నన్ను బాధిస్తావా!" అని తాత్పర్యం. **"నీ నడువే"** – అంటే– నీ ఆర్తి మా ఆర్తి కంటే విలక్షణంగా ఉన్నది – అని అర్థం. **"కనై యిరుళే"** అంటే– ఘనమైన – దట్టమైన అంధకారమా! అని అర్థం. అంధకారంలోని గాఢత్వం దాని క్లేశాతిశయాన్ని సూచిస్తున్నదని భావం. ఇక్కడ ఘనమని అర్థమిచ్చే **"కన"** అనే ద్రావిడ పదంలో చివరగల నకారానికి, తరువాత గల **"ఇరుళే"** పదంలో మొదట గల యకారం యొక్క సాహచర్యంవల్ల ఐకారం రాగా **"కన"** అనే పదం **"కనై"**గా మాఱింది. ఆళవందార్ నిర్వాహంలో **"కనైయిరుళ్!"** అనే ప్రయోగానికి – చీకటికి దట్టంగా ఉండడమనేది దాని స్వభావమని తెలియక, అదికూడా భగవద్విశ్లేషం వల్ల కాంతిహీనమై ఉన్నది – అని నాయకి భావిస్తున్నది – అని భావం. **"వేఱ్ఱోర్వకై మాఱ్ఱాన్మై నిఱ్ఱియో"** అనే ప్రయోగానికి ఆళవందార్ నిర్వాహంలో – "నీ భగవద్విశ్లేషాతి శయాన్ని చూపి, శత్రువులు బాధించే రీతి కంటే ఎక్కువగా మమ్ములను బాధిస్తున్నావే!" అని తాత్పర్యం. ఈ యోజనలో **"నీ యూழி మాఱ్ఱాణ్మై నిఱ్ఱియో"**– కాలతత్త్వం ఉన్నత కాలం, అంటే – నిత్యంగా –

శత్రుత్వంలో నిలచి ఉంటావా! పగను సాధిస్తావా! – అనే ప్రయోగానికి స్వారస్యం లేదు. శ్రీరామానుజుల యోజనలో స్వారస్యమున్నది. **"వాழி"** – (నీకు మంగళం కలగాలి) అనే పదానికి – "నీ క్లేశం తీరి నీవు ఉజ్జీవించాలి" అనే అర్థంలో స్వారస్యమున్నది. శ్రీరామానుజుల నిర్వాహంలో వ్యతిరేకలక్షణార్థంలో – హింసించే వారిని "నీవు చిరకాలం బతకాలి" అని పలికే రీతిలో అర్థం గ్రహించాలి. ఈవిధంగా గమనిస్తే శ్రీరామానుజుల నిర్వాహంలో పాశురంలోని పదాలకు అన్నిటికి స్వారస్యం ఉన్నదని, పూర్వయోజనతో కొన్ని పదాలకు స్వారస్యం లేదని ఏర్పడుతున్నందున శ్రీరామానుజుల నిర్వాహం అభ్యర్హితం.

ఇక్కడ ప్రసంగాత్ ఒక విషయం విన్నపింపబడుతున్నది. పాశురంలోని **"వేఱ్ఱోర్ వకైయిల్ కొడిదాయ్"** అనే ప్రయోగానికి విలక్షణమైన అర్థం తెలుపబడింది. **"వకై"** – అంటే – వివిధ రీతులు. **"వేఱ్ఱోర్ వకై"** అంటే – శత్రువుల రీతులు. శత్రువులలోని వేర్వేరు ప్రకారాలు ఏవి? అంటే? సదయహింస కత్వం, నిర్దయహింసకత్వమని శత్రుప్రకారాలు రెండున్నాయి. అవి – ప్రత్యర్థి బాధపడుతూ ఉంటే దయను చూపించడం, దయను ఏ మాత్రం చూపకపోవడం. రావణుని గాయాల బాధను చూచి, దయ చూపి శ్రీరాముడు **"గచ్ఛ, అనుజానామి"** (వెళ్ళు, అనుమతిస్తున్నాను) అని పల్కడం సదయహింసకత్వం. ఆ విధంగా దయ చూపకుండా హింసించడం నిర్దయ హింసకత్వం. ఇక్కడ చీకటి చేసే హింస ఈ రెండు ప్రకారాల కంటే విలక్షణంగా ఉన్నది – అనే అర్థం **"వకైయిల్"** (రెండు విధాలుగా ఉండే శత్రువుల హింసాప్రకారాల కంటే) అనే పంచమ్యంత రూపంగా గ్రహించి అర్థం చెప్పడం ద్వారా స్ఫురిస్తుంది. ఇక్కడ ప్రకారమనే అర్థమిచ్చే పదం శత్రువుల ప్రకారాన్ని తెల్పుతుంది తప్ప, హింసాప్రకారాలకు కాదు. ఈ భావాన్ని ఈడు వ్యాఖ్యలోని **"నీర్మైయుడైయార్ పడియుమ్ కణ్డిలోమ్, శత్రుక్కళ్ పడియమ్ కణ్డిలోమ్. ఉన్నతు వ్యావృత్తమాయిరున్దతీ!"** (నీలో దయను కలవారి రీతిని చూడలేకున్నాము, నిర్దయశత్రువుల రీతిని చూడలేకున్నాము. నీ రీతి విలక్షణంగా ఉన్నదే!) అనే వాక్యం వ్యక్తం చేస్తున్నది. పూర్వుల నిర్వాహంలో **"వేఱ్ఱోర్ వకైయిల్ కొడిదాయ్"** అనే ప్రయోగానికి – "నీ విరహార్తిని చూపి, శత్రువులు బాధించే రీతికంటే ఎక్కువగా మమ్ములను బాధిస్తున్నావే!" – అని భావం.

భగవద్రామానుజులు చూపిన అర్థనిర్వాహాన్నే అమ్మఙ్గియమ్మాళ్ నిర్బంధంగా పలికేవారట. అమ్మంగి యమ్మాళ్ అనేవారు నంజీయర్ సమకాలీనులనే విషయం పెరియ తిరుమొழி (3–6–9) వ పాశుర వ్యాఖ్యలోని ఐతిహ్యం వల్ల తెలుస్తున్నది. వీరి నామప్రస్తావన తిరువిరుత్తంలోని 1వ పాశురం (పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య), తిరువాయ్‌మొழி (4–5–1), (4–6–11), (5–9–10), (7–4–4), (7–6–ప్రవేశం), (7–6–10), (8–3–11), (8–4–1), (8–5–5), (8–7–9) పాశురాలకు ఈడు వ్యాఖ్యలో గోచరిస్తుంది. దీనినిబట్టి వీరు దివ్యప్రబంధాలలో తలస్పర్శి అయిన అవగాహనను కలవారని, నిశితమైన పరిశీలనా దృక్పథాన్ని, మధురార్థసమన్వయశక్తిని కలవారని తెలుస్తున్నది. ఇటువంటి మహనీయుల చరిత్ర పండితలోకానికి పరిచితమైనా, అందఱికి అందవలసి ఉన్నది కదా! ఆఱాయిర ప్పడిలో పిళ్ళాన్ ఒన్బది నాయిరప్పడి వ్యాఖ్యలో నంజీయర్, ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీరామానుజుల నిర్వాహానుసారం గానే వివరించారు. **"ఉనక్కు బాధ్య బాధకభావ సంబంధ మిన్ఱిక్కే ఇరుక్కచ్చెయ్‌దే, శత్రుక్కళ్ పడియిలుమ్ కొడిదాక చ్చెయ్యానిన్ఱాయ్, శత్రుక్కళ్ ఆనాలుమ్ నోవు పట్టారై ఐయో! ఎన్ఱన్ఱో పడుప్పదు".** ఇత్యాదిగా ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో వివరింపబడడం గమనించవచ్చు.

## భగవదనుభవం సర్వరసాత్మకమ్

## 7) 2–3–1 – ఈడు వ్యాఖ్యానమ్

**( తేనుమ్ పాలుమ్ – ఇత్యాది ) ఇదుక్కు ఆళవందార్ అరుళిచ్చెయ్‌దారాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి – "ఏకజాతీయద్రవ్యఙ్గళ్ తన్నిలే కలన్దాప్పోలే" ఎన్ఱు. అదావదు, తేనుమ్ తేనుమ్ కలన్దాప్పోలేయుమ్, పాలుమ్ పాలుమ్ కలన్దా–ప్పోలేయుమ్, నెయ్యుమ్ నెయ్యుమ్ కలన్దాప్పోలేయుమ్, కన్నలుమ్ కన్నలుమ్ కలన్దాప్పోలేయుమ్ – ఎన్ఱు. అఙ్గనన్ఱిక్కే, ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి – ఇవఱ్ఱై రసవత్పదార్థఙ్గళుక్కు ఎల్లామ్ ఉపలక్షణమాక్కి, "తానుమ్, నానుమ్ కలన్ద కలవిక్కుళ్ళే ఎల్లా రసఙ్గళుమ్ పిఱక్కుమ్బడి సంశ్లేషిత్తోమ్ – ఎన్ఱు".**

**(తేనుమ్ పాలుమ్ – ఇత్యాది)** – దీనికి ఆళవందార్ పల్కిన నిర్వాహమని తిరుమాలై యాణ్డాన్ చెప్పినది ఏమంటే – ఏకజాతీయ (ఒక జాతికి చెందిన)

ద్రవ్యాలు తమలో తాము కలసి పోయినట్లుగా – అని. అంటే – తేనె తేనెతో కలిసినట్లు, పాలు పాలతో కలసినట్లు, నేయి నేయితో కలసినట్లు, బెల్లం బెల్లంతో కలిసినట్లు నేను, సర్వేశ్వరుడు కలసిపోయాము – అని భావం. ఆ రీతిలో కాకుండా, శ్రీరామానుజులు పల్కిన నిర్వాహం ఏమంటే – వీటిని తేనె, పాలు, బెల్లం, నేయి అనే వానిని రసవత్పదార్థాలన్నింటిని ఉపలక్షణంగా గ్రహించి, "తాను (పరమాత్మ), నేను కలసిన సంశ్లేషంతో అన్ని రసాల ఆస్వాదన కలిగేటట్లు సంశ్లేషించాము"–అని.

**"తానుమ్ యానుమెల్లామ్ తన్నుళ్ళే కలన్దొ<u>ழி</u>న్దోమ్, తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలు మముదమొత్తే"** (భగవానుడు, నేను తేనె, పాలు, బెల్లం, అమృతంవలె అన్ని రసాలు కలిగేటట్లు సంశ్లేషించాము) అని తిరువాయ్‌మొ<u>ழி</u>లో ఆ<u>ழ</u>్వార్లు పలికారు. దీనిని వ్యాఖ్యానించే నమ్పిళ్ళై ఆళవందార్ నిర్వాహాన్ని, శ్రీరామానుజుల నిర్వాహాన్ని ప్రస్తావించారు.

ఆళవందార్ నిర్వాహానుసారం – ఒకే రసాన్ని కల వస్తువులు తమలో తాము కలిసినట్లుగా మేమిద్దరం కలసిపోయాము – అని ఆ<u>ழ</u>్వార్లు అంటున్నారు. అంటే – తేనె తేనెతో కలసినట్లు, పాలు పాలతో కలసినట్లు, నేయి నేయితో కలసినట్లు, బెల్లం బెల్లంతో కలిసినట్లు, అమృతం అమృతంతో కలసినట్లు నేను, భగవానుడు సంశ్లేషించాము – అని పల్కుతున్నారు – అనేది ఆళవందార్ అర్థ నిర్వాహం. ఈ అర్థంలో **"ఒత్తు"** – అంటే **"వలె"** – (ఉపమావాచకం) అని అర్థం.

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. ఆళవందార్ నిర్వాహంలో – "తేనె తేనెతో, పాలు పాలతో, నేయి నేయితో, బెల్లం బెల్లంతో, అమృతం అమృతంతో కలిసినట్లు" అని చెప్పినందున స్వరూపైక్యం పల్కినట్లు కదా అవుతుంది – అనేది ఆ సందేహం.

ఒక శేరు పాలు, ఒక శేరు పాలు కలిస్తే ఒకే శేరు పాలుగా ఉంటాయా? రెండు శేర్ల పాలు అయేటట్లుగా పరిమాణాధిక్యం గోచరిస్తుంది కదా! ఇది ద్రవ్యాంతర సద్భావానికి ప్రమాణం. అందువల్ల ఇక్కడ "తేనె తేనెతో కలిసినట్లు" ఇత్యాదిగా పల్కడంలో తాత్పర్యమేమంటే – అవిభాజ్యంగా కలసిపోయాము – అని మాత్రమే. రెండు వస్తువులు (ఆత్మ, పరమాత్మలనే రెండు వస్తువులు) రెండు వస్తువులుగానే మిగిలి ఉంటాయి. రెండిటి స్వరూపం జ్ఞానానందాలేకదా. అందువల్ల తేనె తేనెతో,

పాలు పాలుతో, నేయి నేయితో కలసినట్లుగా – అని నిర్వహింపబడింది. ఈ సందర్భంలో – **"యథా నద్యః స్యందమానా స్సముద్రే అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ, తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్"** (ముండక–3–2) (ప్రవహించే నదులు సముద్రాన్ని చేరి తమ నామరూపాలను విడచిపెట్టి, అందులో కలసిపోయేటట్లే, బ్రహ్మజ్ఞాని నామరూపాలనుండి విముక్తుడై, పరాత్పరుడైన దివ్య పురుషుని పొందుతున్నాడు) అనే శ్రుతి పల్కిన రీతి స్మరణీయం. అందువల్ల నామరూప విభాగానర్హమైన స్థితిని పొంది, విభాగానర్హంగా ఉండేస్థితి తప్ప స్వరూపైక్యం కాదు.

ఇక, శ్రీరామానుజుల చూపిన అర్థనిర్వాహంలో– **"సర్వగంధః–సర్వరసః"** (పరమాత్మ అని గంధాలను కలవాడు, అన్ని రసాలను కలవాడు అన్ని గంధాల అనుభవాన్ని కల్గించేవాడు, అన్ని రసాల అనుభూతిని కల్గించేవాడు) అని, **"తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యమ్"** (పరమాత్మలో ఉండే కల్యాణగుణాలు ధ్యానించదగినవి అన్వేషించదగినవి) అని, **"ఇమ మాత్మాన మనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్ కామాన్"** (ఈ పరమాత్మను తెలిసికొని, బ్రహ్మజ్ఞాని ఈ పరమాత్మలోని సత్యమైన ఈ కల్యాణగుణాలను పొందుతున్నాడు) అని, **"యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్ సమాహితమ్"** (ఈ ఉపాసకునకు ఈ లోకంలో ఏ భోగ్యజాతం ఉన్నదో, ఏది కాదో, అది అంతా పరమాత్మలో చక్కగా ఉన్నది) అని సమస్తకల్యాణ గుణాకరుడుగా, చేతనులకు ఉపాసించదగినవాడుగా, ప్రాప్యుడుగా చెప్పబడే పరమాత్మ, జ్ఞానానంద స్వరూపుడనై, **"అహ మన్న మహ మన్నమ్"** అని భగవానునకు భోగ్యభూతునిగా ఉండే నేను, ఇద్దఱం – తేనె, పాలు, నేయి, బెల్లం, అమృతం, ఇంకా ఇటువంటి అన్ని రసవత్ పదార్థాల రసం అనుభావ్యమయే రీతిలో కలసిపోయాము" – అని అర్థం. ఇక్కడ పరమాత్మ, జీవాత్మలు ఇద్దఱు పరస్పరం భోగ్యమైన వారు కనుక, భోగ్యపదార్థాలు అన్నిటి కలయిక వలె వారి కలయిక పరమభోగ్యంగా ఉంటుంది. **"ప్రియో హి జ్ఞానినోత్యర్థ మహం స చ మమ ప్రియః"** అనే శ్లోకాన్ని శ్రీరామానుజులు **"జ్ఞానినః అహం అత్యర్థం ప్రియః, స చ మమ అత్యర్థం ప్రియః"** అని రెండు విధాలుగా అన్వయించి అర్థం చెప్పారు కదా! భగవంతుడు సర్వరసాత్మకుడైనందున భగవదనుభవం సర్వరసాత్మకమై జీవునకు

కల్లగడంలో లోటు లేదు. పరమాత్మకు కలిగే అనుభవం గూర్చి ఏమనాలి? అంటె, సర్వరసానుభూతి వల్ల ఎటువంటి ఆనందం కల్గుతుందో, అటువంటి ఆనందం కల్గుతుందని ఉదాహరణగా మాత్రమే చెప్పాలి. **"సర్వరసః"** ఇత్యాది శ్రుతి ఐకాంతికం కదా! **"అహమన్న మహమన్న మహమన్నమ్"** అని జీవుడు భగవానునకు భోగ్య భూతుదనడంలో మాత్రం అడ్డులేదు. అది శ్రుతిసిద్ధమే. ఈ అర్థంలో **"తన్నుళ్ళే"** – అంటే – సంశ్లేషం లోపల – అని, **"ఒత్తు"** అంటే – ఉండేటట్లు – అని అర్థం. సర్వగంధాత్మకుడై, సర్వ రసాత్మకుడైన పరమాత్మతో కల్గిన సంశ్లేషం అయినందున అన్ని రసాల అనుభవం కల్గిందని తాత్పర్యం. ఈ అర్థంలో – **"ఉన్నై ప్పెற்று, వానుళార్‌పెరుమాన్ మదు శూదన్ ఎన్నమ్మాన్ తానుమ్, యానుమాకిఅ తన్నుళ్ళే తేనుమ్ పాలుమ్ నెయ్యుమ్ కన్నలుమ్ అముదుమాకిఅ ఎల్లా రసఙ్గళుమ్ ఉణ్డామ్బడి కలన్దొழிన్దోమ్, ఊనిల్ వాழ் ఉయిరే! నల్లై, పో"** అని అన్వయం. (నిన్ను పొంది, నిత్యసూరినాథుడు, మధుసూదనుడు, నా స్వామి, తాను నేను అనే తనలో తేనె, పాలు, నేయి, బెల్లం, అమృతం మొదలైన అన్ని రసాల అనుభవం కలిగేటట్లు సంశ్లేషించాము, శరీరంలో నిలచి ఉండే ఓ మనసా! మంచిదే, పో – అని అన్వయం.)

ఈ భగవద్రామానుజుల నిర్వాహంలో ఇంకొక విశేషం కూడా ఉన్నది. ముక్తపురుషుడు పరమపదంలో **"సోశ్నుతే సర్వాన్ కామాన్"** అని పరమాత్మ యొక్క సకలకల్యాణగుణాల అనుభవాన్ని పొందుతాడని శ్రుతి పేర్కొంటున్నది. ఆழ்వార్ల అనుభవం సాక్షాత్ పరమపదానుభవం కాక, మానసిక సాక్షాత్కారానుభవమే అయినా, క్షణికమే అయినా, అది పరమపదానుభవతుల్యమే. కనుక, అందులో పరమాత్మయొక్క సకల కల్యాణగుణానుభవం భాసించడంలో లోటులేదు. అందువల్ల– సర్వరసవత్‌పదార్థానుభవం కలిగేటట్లు – అనే శ్రీరామానుజుల నిర్వాహం సకల కల్యాణ గుణానుభవానికి అనుగుణం. ఈ విధంగా, అతి గంభీరాలైన ఉభయ వేదాంతైక కంఠరూపాలైన శ్రీరామానుజుల నిర్వాహాలలోని మధురమైన విశేషాలు సహృదయహృదయైకవేద్యాలు.

ఈ నిర్వాహం ఇరుపత్తునాలాయిరప్పడితోకూడా చూపబడింది. ఆఱాయిరప్పడి, ఒన్బది నాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానుసారంగా,

పన్నీరాయిరప్పడిలో ఆళవందార్ నిరాహానుసారంగా వ్యాఖ్యానింపబడింది. ఉదాహరణంగా **"ఇన్ద క్కలవియినుళ్ళే ఎల్లా రసఙ్గళుమ్ ఉణ్డామ్బడి కలన్దోమ్"** (ఈ సంశ్లేషంలో అన్ని రసాలు కలిగేటట్లు సంశ్లేషించాము) అనే ఆఱాయిరప్పడి వ్యాఖ్యాసూక్తి గమనార్హం. ఈ విధంగా శ్రీరామానుజులు పలు రస్యార్థాలను పల్కినందు వల్లనే తిరువాయ్మొ*ழ்*ి ప్రబంధ వ్యాఖ్యానాలు తరువాతి కాలంలో శాఖోపశాఖలుగా విస్తరించి, అమూల్యమైన భాసిల్లుతున్నది. శ్రీరామానుజులు తిరువాయ్మొ*ழ்*ి పాశురాలకు పలు – శాస్త్రీయాలైన రస్య రహస్యార్థాలను గ్రహించే అవకాశమున్నది అనే అర్థనిర్వాహాల ద్వారా చూపించి ఉండకపోతే, తరువాత, శ్రీరామానుజులు అంతటివారే మౌనంగా ఉన్నపుడు మనం కొత్తగా ఏ అర్థాన్ని నిర్వహించడం తగదు అని మౌనంగా ఉండిపోయేవారనడంలో సందేహం లేదు కదా!

## శ్రీరామానుజుల అర్థనిర్వాహక వైభవం

### 8) 2-3-3 – ఈడు వాఖ్యానమ్

**"ఆళవందార్ అరుళిచ్చెయ్దదాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి" – అఱివు నడైయాదాద దశైయిలే సంబంధజ్ఞానత్తై ప్పిఱప్పిత్తు, పిఱన్ద జ్ఞానత్తై య*ழ்*ియక్కడవదాన దేహసంబంధత్తోడే పిన్నైయుమ్ వైత్తాయ్ – ఎన్గిఱ ఇ*ழ*వాలే శొల్లుకిఱార్ – ఎన్రామ్. ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి – "మున్నిఱ్పాట్టుక్కుళుమ్, పిన్నిఱ్పాట్టుక్కుళుమ్ ప్రీతియోడే నడవానిఱ్కు, నడువే యప్రీతి తో*ற்ற* చ్చొల్లుమదు శేరాదు అన పిన్బు, ఇఙ్గనే యామిత్తనై – "అఱియామామాయత్తడియేనై – అఱియాక్కాలత్తుళ్ళే అడిమైక్కు అన్బుశెయ్విత్తు వైత్తాయాల్ – ఎన్గిఱార్ – ఎన్ఱు ఇత్తనైయుమ్ ఒరు ఉపకారమాక్కి అరుళిచ్చెయ్తార్. "అత్తా! నీ శెయ్దన – ఎన్ఱు నాన్ పణ్ణిన ఉపకారఙ్గళై చ్చొల్లా నిన్దీర్. అవ*ற்ற*ిలే నీర్ మదిత్తిరుప్పదొరు ఉపకారత్తై చ్చొల్లిక్కాణీరెన్న, అత్తై చ్చొల్లుకిఱార్"**

(ఆళవందార్ ఇక్కడ ఈ విధంగా అర్థాన్ని పలికారని తిరుమాలై యాణ్డాన్ చెప్పే వారు – జ్ఞానం లేని దశలో నాకు సంబంధజ్ఞానాన్ని కల్గించి, కల్గిన జ్ఞానం నశించి పోయే దేహసంబంధంతో మళ్ళీ నన్ను ఉంచావే! – అనే క్లేశంతో పల్కుతున్నారు– అని. దీనిని శ్రీరామానుజులు ఆలకించి, "ఈ పాశురానికి ముందు పాశురాలలో, తరువాత పాశురాలలో కూడా ఆ*ழ*్వార్లు ప్రీతితో పల్కుతున్నందున,

మధ్యలో మాత్రం క్లేశంతో పల్కుతున్నారనడం పొసగదు. అందువల్ల పాశురాన్ని ఈ విధంగా అన్వయించాలి. అచిత్ సంబంధాన్ని కల్గి ఉన్న నాకు – అజ్ఞాతసమయం నుండి దాస్యం పట్ల – కైంకర్యం పట్ల – అనురాగాన్ని కల్గించావు. ఆహా!" – అని దీనినికూడా ఒక ఉపకారంగా అన్వయించి ఆழ்వార్లు పల్కుతున్నారు. "స్వామీ! నీవు చేసిన ఉపకారాలు" ఇవి అని నేను ఉపకారాలను చేసినట్లు మీరు పల్కుతున్నారే. వాటిలో మీరు గొప్పగా తలచిన ఒక ఉపకారాన్ని గూర్చి పల్కండి" అని భగవానుడనగా, ఆ ఉపకారాన్ని గూర్చి ఆழ்వార్లు ఇక్కడ పల్కుతున్నారు.

ఈ అర్థనిర్వాహానికి శ్రీరామానుజుల చరిత్రకు సంబంధించిన ఒక నేపథ్యం ఉన్నది. తిరుమాలై యాణ్డాన్ శ్రీరామానుజులకు తిరువాయ్‌మొళి ప్రవచనాన్ని చేసిన ఆచార్యులు. తిరుక్కోటియూర్ నంబి ప్రోద్బలంతో తిరుమాలై యాణ్డాన్ వద్ద శ్రీరామానుజులు తిరువాయ్‌మొళి ప్రబంధ కాలక్షేపాన్ని చేశారు. కొన్ని కొన్ని సందర్భాలలో ఆణ్డాన్ తెలిపే ఆళవందార్ అర్థనిర్వాహాల కంటే విలక్షణమైన సరసమైన అర్థాలను శ్రీరామానుజులు ప్రస్తావించేవారు. ఆవిధంగా శ్రీరామానుజులు పల్కిన అర్థాలలో ఇది ఒకటి. ఈ అర్థనిర్వాహాన్ని శ్రీరామానుజులు పల్కగానే, తిరుమాలై యాణ్డాన్ చాలా కోపించి, "మీరు విశ్వామిత్ర సృష్టి చేస్తూ ఏవోవో అర్థాలను చెబుతున్నారు. ఈవిధంగా అయితే సంప్రదాయానికి విచ్ఛేదం వస్తుంది. నేను మీకు ప్రవచనాన్ని చేయను" అని ప్రవచనాన్ని నిలిపివేశారు. శ్రీరామానుజులు కూడా ఏమీ అనలేక మౌనంగా ఉండిపోయారు. కొంతకాలానికి ఈ విషయం తిరుక్కోటియూర్ నంబికి తెలిసి, ఆణ్డాన్ దగ్గరకు వచ్చి ప్రవచనాన్ని నిలిపివేసిన కారణాన్ని అడిగినపుడు, ఆణ్డాన్ జరిగిన సంగతిని తెలిపారు. అపుడు నంబి ఆణ్డాన్‌తో "అయ్యో! ఈ అర్థాలన్నీ దాసునకు మన ఆచార్యులు ఆళవందార్ కొన్ని సందర్భాలలో ఉపదేశించినవే. ఇది ఏమీ శ్రీరామానుజులు కొత్తగా కల్పించి పల్కినవి కావు సుమా! మీరు కోపపడకుండా మళ్ళీ ప్రవచనాన్ని కొనసాగించి పూర్తి చేయండి" శ్రీరామానుజులు సామాన్యవ్యక్తి కారు. అవతార పురుషులుగా గుర్తించండి. వారి వల్ల విశిష్టాద్వైత సంప్రదాయం వర్ధిల్లగలదు అని గ్రహించండి" అని ప్రోత్సహించి, శ్రీరామానుజులను కూడా తిరిగి ఆణ్డాన్ దగ్గర ప్రవచనాన్ని ఆలకించేటట్లు చేశారు– అనేది శ్రీరామానుజుల చరిత్రలోని ఒక అంశం.

**"వైత్తాయ్, ఆల్!"** – అనే ప్రయోగాన్ని నమ్బిళ్ళై **"ఇదెఙ్గే శిఱైప్పట్టాలుమ్ నల్లదు, నమ్ వస్తువన్రో ఎన్ఱు వైత్తాయ్, ఆల్"** అని రెండు నిర్వాహాలకు తగినట్లు వ్యాఖ్యానించడం ఒక ఉదాహరణం. ఈ వాక్యానికి శ్రియామున నిర్వాహంలో – "ఇతడు మనకు పరతంత్రుడు కదా! ఎక్కడ చెఱలో ఉన్నా ఉండనీ! క్రమంగా అనుగ్రహిస్తాను అని నన్ను ఉపేక్షిస్తున్నావు, అయ్యో!" అని, శ్రీరామానుజుల నిర్వాహంలో – "చాలా జుగుప్సను కల్గించే అచిత్ సంబంధాన్ని కల్గినవాడనైనా, మన ఇద్దఱి మధ్య ఉండే సంబంధాన్ని చూచి, నీ కైంకర్యం పట్ల ఆసక్తిని కల్గించావు, ఆహా!" అని తాత్పర్యం.

**"అఱియా క్కాలత్తుళ్ళే అడిమైక్కణ్ అన్బు శెయ్విత్తు, అఱియా మామాయత్తు అడియేనై వైత్తాయ్, ఆల్"** అని ఆఴ్వార్లు పల్కిన సూక్తిని ఈడులో వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై, ఆళవన్దార్ నిర్వాహాన్ని, శ్రీరామానుజుల నిర్వాహాన్ని ప్రస్తావించారు.

ఆళవందార్ పల్కినట్లుగా తిరుమాలైయాణ్డాన్ పల్కిన నిర్వాహం ఏమంటే– జ్ఞానం ఏమాత్రం లేని చిన్నతనంలోనే దాసుడనైన నాకు యథార్థజ్ఞానాన్ని కల్గించి, నీకు కైంకర్యం చేయాలనే అభినివేశాన్ని కల్గించి, తరువాత ఆ యథార్థ జ్ఞానాన్ని నశింపజేసే ఈ శరీరంతో నన్ను చేర్చావే!" అని ఆఴ్వార్లు క్లేశపడుతున్నారు – అని పాశురంలోని పదాలను యథావస్థితంగా అన్వయించి, తిరుమాలై యాణ్డాన్ (ఆళవందార్) పల్కిన నిర్వాహం ఇది.

దీనిని శ్రీరామానుజులు విని, "ఈ దశకంలో ఆఴ్వార్లు ఈ పాశురానికి ముందు పల్కిన పాశురాలలో, తరువాత పల్కిన పాశురాలలో తమ ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నారు. ముందు పాశురంలో **"అఱియాదన అఱివిత్త అత్తా!"** (నాకు తెలియనివానిని తెల్పిన స్వామీ!) అని, తరువాత పాశురంలో **"ఏనదావియుళ్ కలన్ద పెరునల్లుదవి"** (నా ఆత్మలో కలసిన గొప్ప మంచి ఉపకారం) అని భగవంతుడు చేసిన ఉపకారాలను ఆనందంగా కొనియాడారు. అందుచేత, మధ్యలో ఈ ఒక్క పాశురంలో మాత్రం ఆఴ్వార్లు క్లేశంతో పల్కుతున్నారని అనడం పొసగదు. అందువల్ల **"పాఠక్రమాదర్థక్రమో బలీయః"** పదాలను పాశురంలోని క్రమంలో కాకుండా అర్థానుసారంగా కొంచెం క్రమాన్ని మార్చి అన్వయించి, **"అఱియా మామాయత్తు**

**అడియేనై, అతియాక్కాలత్తుళ్ళే అడిమైక్కణ్ అన్బుశెయ్‌విత్తాయ్!"** (జ్ఞానహానిని కల్గించే సంసారంలో పరిభ్రమించే నన్ను జ్ఞానం లేని లేత వయస్సులోనే దాస్యం పట్ల ప్రీతిని కలవాడను అయేటట్లు చేశావే!) అని దీనిని కూడా భగవానుడు చేసిన ఉపకారంగా ఆழ్వార్లు సంతోషంతో పల్కుతున్నారు – అనే అర్థాన్ని వ్యక్తం చేశారు. గడచిన పాశురంలో **"అతియాదన అతివిత్త"** అని జ్ఞానాన్ని అనుగ్రహించడం తెలుపబడగా, ఈ పాశురంలో **"అడిమైక్కణ్ అన్బు శెయ్‌నిత్తు"** అని భక్తికి అనుగ్రహించడం తెలుపబడింది – అని శ్రీరామానుజుల నిర్వాహంలోని అభిప్రాయం. ఇక్కడ **"అన్బు"** అనే పదం సంగం, కామం, అనురాగం, స్నేహం మొదలైన వానిని లక్షిస్తుంది. శ్రీరామానుజుల, యామునుల నిర్వాహాను గుణంగానే నమ్పిళ్ళై పాశురాన్ని వ్యాఖ్యానించారు. పన్నీరాయిరప్పడి, ఒన్బది నాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజనిర్వాహానుగుణంగా వ్యాఖ్యానింపబడింది. **"ఆల్"** అనే పదం ఆళవందార్ నిర్వాహంలో దుఃఖసూచకంగా, శ్రీరామానుజుల నిర్వాహంలో సంతోష సూచకంగా గ్రహించాలి. యజమాని, తన సొత్తు అయిన ఒక అమూల్యమైన మాణిక్యం చేతినుండి జారి బురదలో పడినంతమాత్రంలో దానిని పూర్తిగా విడచిపెట్టడు కదా! బురదనుండి బయటకు తీసి, బురదను కడిగి తుడిచి భద్రం చేస్తాడు. (ఆ విధంగానే భగవానుడు సంసారంలో భ్రమించే తమ ఆత్మను గ్రహించి, తీర్చిదిద్దాడు – అని తాత్పర్యం).

ఆ విధంగానే, హేయమైన సంసారంలో పరిభ్రమిస్తూ ఉండే నన్ను చూచి, విడువకుండా, "ఇతడు నా సొత్తు కదా? అందువల్ల, ఇతని శేషత్వానికి తగినట్లు కైంకర్యంలో అన్వయింపజేస్తే మంచిది" అని తలచి, నాకు దాస్యం పట్ల ఆసక్తిని కల్గించావు – అని భావం. ప్రకరణానుగుణంగా శ్రీరామానుజులు అర్థనిర్వాహాన్ని చేస్తారనే విషయానికి ఇది మరి ఒక ఉదాహరణం.

ఆళవందార్ నిర్వాహంలో – ఈ పాశురానికి ముందున్న రెండు పాశురాలలో ఆழ్వార్లకు కల్గిన సంశ్లేషం మానసానుభవమే అయినందున, బాహ్యసంశ్లేషం కల్గనందున, "దీనికి హేతువు ప్రకృతిసంబంధమే" అని తలచి, దానిని ఈ పాశురంలో గర్హిస్తున్నారు – అనే పాశురసంగతిని భావించాలి. ఈ విధంగా ఆళవందార్ అర్థనిర్వాహం చేయడానికొక కారణమున్నది. **"కైయార్ శక్కరమ్"**

(5–1) అనే దశకంలో ముందు, వెనుకలలో అంతటా హర్షం వ్యక్తమవుతూ ఉండగా, **"ఎన్కళ్వన్"** (5–1–45) అనే నాల్గవ పాశురంలో, అయిదవ పాశురంలో మాత్రం – పూర్వం కల్గిన మానసిక సంశ్లేషం బాహ్యసంశ్లేషయోగ్యం కానందున, ఈ విధంగా బాహ్యసంశ్లేషం కల్గకపోవడానికి కారణమైన ప్రకృతితో నాకు సంబంధాన్ని కల్గించావు – అని ఆ సంబంధాన్ని గర్హించారు. ఆ విధంగానే ఆళ్వార్లు ఇక్కడ కూడా గర్హిస్తున్నారనే భావనతో ఆళవందార్ అర్థాన్ని నిర్వహించారు. అయితే, ఒక్క మూడవ పాశురంలో మాత్రం ఆళ్వార్లు క్లేశ పడుతున్నారని అర్థాన్ని చెప్పడం కంటే, అన్ని పాశురాలలో ఆనందం వ్యక్తం చేస్తున్నారని దశకం అంతా ఏకరీతిలో అర్థనిర్వాహం చేయడం సరసతరమని, ప్రకరణానుగుణమని తలచి, శ్రీరామానుజులు పాశురంలోని పదాల క్రమాన్ని కొంచెం మార్చి అన్వయించి అర్థనిర్వాహాన్ని చేశారు. ఇది సరసమే కాక, శాస్త్రీయం కూడా. ఆఱాయిరప్పడి, ఒన్బది నాయిరప్పడి, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహానికి అనుగుణంగా వివరింపబడింది.

## ఆళ్వార్ల సంబంధంతో భగవదాయదాలు సత్తను పొందాయి.

## 9) 2–5–1 – ఈడు వ్యాఖ్యానమ్

**"అడియార్కళ్ కుళాఙ్గళై ఉడన్ కూడువదు ఎన్ఱుకొలో! ఎన్ఱు ఇవర్ ఆశైప్పట్ట పడియే నిత్యసూరికళోడే వన్దు కలన్దాన్" ఎన్ఱు ఆళవందార్ అరుళిచ్చెయ్దారాక త్తిరుమాలైయాణ్డాన్ పణిక్కుమ్బడి..... అఙ్గనన్ఱిక్కే, ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యు మ్బడి – "ఇవరోడు సంశ్లేషిప్పదఱ్కు మున్బు అవనోడు ఒక్క ఇవైయుమ్ అనుజ్జ్వలమాయ్, అసత్సమమాయ్, ఇవరోడు కలన్ద పిన్బు, ఉజ్జ్వలమాయ్, సత్తై పెఱ్ఱ్రుపడి శొల్లుకిఱదు – ఎన్ఱు".**

(భగవద్భక్తుల సమూహాలతో కలిసేది ఏనాడో కదా! – అని ఆళ్వార్లు ఆశపడినట్లే, భగవానుడు నిత్యసూరులతో (దివ్యభూషణాలు) కలిసివచ్చి సంశ్లేషించాడు – అని ఆళవందార్ పల్కినట్లు తిరుమాలైయాణ్డాన్ పలికారు.... ఆ రీతిలో కాకుండా, శ్రీరామానుజులు పలికే రీతి (ఏమంటే) – ఆళ్వార్లతో సంశ్లేషించడానికి ముందు అతనితో (భగవంతునితో) పాటు ఈ భూషణాదులు

కూడా అనుజ్జ్వలమై, సత్తను కోల్పోయినట్లుగా అయినవి. వీరితో కలిసిన తరువాత ఉజ్జ్వలమైన సత్తను పొందిన రీతి తెలుపబడుతున్నది – అని)

**"అన్దామత్తు అన్బు శెయ్‌దు ఎన్ ఆవి శేర్ అమ్మానుక్కు అన్దామ వాழ் ముడి శఙ్గు ఆழிనూలార ముళ"** (పరమపదంపట్ల కల్గి ఉంటే ప్రీతిని నా విషయంలో పొంది, నా ఆత్మలోకి వచ్చి పొందికగా నిలచిన స్వామికి, అందమైన వనమాల, కాంతిని కల కిరీటం, శంఖచక్రాలు, యజ్ఞోపవీతం, హారాలు – మొదలైనవి ఉన్నాయి) అని ఆழ்వార్లు పల్కుతున్నారు. తమతో కలిసిన భగవంతుడు, ఆభరణాలతో, ఆయుధాలతో కూడినవాడై వచ్చి కలిశాడు – అని ఆழ்వార్లు పల్కడానికి ఏమి కారణం? అనే విషయాన్నిగూర్చి ఆళవందార్ శ్రీరామానుజులు–అనే ఇద్దఱు ఆచార్యులు పల్కిన అర్థనిర్వాహాలను నమ్పిళ్ళై ప్రస్తావించారు.

ఆళవందార్ పల్కిన వివరణమని తిరుమలైయాణ్డాన్ ఏమి తెలిపారు? అంటే – గడచిన దశకంలో ఆழ்వార్లు **"అడియార్‌కళ్‌కుழாజ్గళుడన్ కూడువదు ఎన్ఱుకొలో?"** (2–3–10) అని భక్తబృందంతో కలవాలి – అనే తమ ఆశను వ్యక్తం చేశారు. అందువల్లనే భగవానుడుకూడా వారి ఆశకు తగినట్లు నిత్య సూరులైన భక్తులతో (శంఖం, చక్రం, ఖడ్గంవంటి దివ్యాయుధాలతో) కూడిన వాడై వచ్చి ఆழ்వార్లతో సంశ్లేషించాడు – అని భక్తపరాధీనుడు, భక్తుల మాటను జవదాటనివాడు కదా అతడు. **"న తే రూపం న చాకారో నాయుధాని... భక్తా నాం త్వం ప్రకాశసే"** ( నీ రూపం, ఆకారం, ఆయుధాలు నీకోసం కాదు, భక్తుల కోసం) – అని భగవానునకు కల అన్నీ భక్తుల కోసమే కదా!

ఆళవందార్‌నిర్వాహంలో **"అమ్మానుక్కు అన్దామవాழ் ముడిశఙ్గు ఆழிనూలార ముళ"** – స్వామికి అందమైన తులసీమాల, ఖడ్గం, కిరీటం, శంఖం చక్రం, యజ్ఞోపవీతం, హారాలున్నాయి – అని అర్థం. **"స్వగ్వస్త్రాభరణై ర్యుక్తం స్వానురూపై రనూపమైః, చిన్మయైః స్వప్రకాశైశ్చాన్యరుచిరంజనైః"** అని పౌష్కర సంహితలో భగవానుని దివ్యాభరణ, దివ్యాస్త్రాదులన్నీ చేతనాలుగా చెప్పబడ్డాయి కదా! చిన్మయాలైన, దివ్యసూరులైన నందక, పాంచజన్య సుదర్శనాదులను అచేతనాలుగా నిర్దేశించడంలో ఏమి భావం? అంటే, అత్యంత పారతంత్ర్య లక్షణాను గుణంగా అచేతనం రీతిలో వర్తిస్తున్నాయనే అర్థాన్ని

పురస్కరించుకొని ఈ విధంగా చెప్పబడింది. ఆళవందార్ నిర్వాహానుగుణంగా నమ్పిళ్లై అవతారికను అనుగ్రహించారు. నంజీయర్ ఒన్బదినాయిరప్పడిలో శ్రీరామానుజుల నిర్వాహాను గుణంగా **"సంశ్లేషత్తాలే ఉళవాన ఎన్నుమ్బడి ఉజ్జ్వల మాయిన"** అని వివరించారు.

దీనిని విని శ్రీరామానుజులు – ఈ పాశురంలోని **"అమ్ దామమ్"** – అందమైన వనమాలిక, **"వాళ్ముడి .... ఆరమ్ ఉళ"** – ఖడ్గం, కిరీటం, హారాలు సత్తను పొందాయి – అనే సవిశేషణంగా పల్కిన పదాలను దృష్టిలో పెట్టుకొని, ఆళ్వార్లతో సంశ్లేషించడానికి ముందు అతనివలెనే అతని ఆభరణాలు, ఆయుధాలుకూడా కాంతి తిరిగి, వెలవెలపోయి, వాడిపోయాయి. వీరితో కలసిన పిమ్మటనే, అవి ఉజ్జ్వలమై, సత్తను పొందినవి అయినవి. దీనినే ఆళ్వార్లు **"అమ్ దామమ్", "వాళ్ ముడి.... ఉళ"** ఇత్యాదిగా తెలిపారు – అని ఒక అందమైన వివరణను ఇచ్చారు. స్వామికి క్లేశం కల్గితే అతడు ధరించిన మాలికాదులు కూడా వాడిపోయి, కాంతిని కోల్పోతాయి కదా! **"అన్దామత్తన్బుశెయ్దు ఎన్ ఆవిరేర్ అమ్మానుక్కు"** – అనే ప్రయోగానికి శ్రీయామునుల నిర్వాహంలో – స్వామి కనుక పరమపదం పట్ల తనకు గల ప్రీతితో సాటి వచ్చే ప్రీతిని నా పట్ల కల్గి ఉన్నాడు, నా మనస్సులోకి వచ్చి చేరాడు – అని అర్థం. శ్రీరామానుజ నిర్వాహంలో – పరమపదం పట్ల తనకు గల ప్రీతి వంటి ప్రీతిని నాపట్ల చూపి, నా మనస్సులో చేరిన తరువాతనే భగవానుడు స్వామి అయ్యాడు – అని భావం. **"అమ్మాన్"** అనేపదం ఆళవందార్ నిర్వాహంలో సిద్ధవరం, శ్రీరామానుజ నిర్వాహంలో సాధ్యపరం.

అళవన్దార్ నిర్వాహంలో – **"ఉళ"** – అంటే – ఉన్నాయి అని అర్థం. అందమైన వనమాల, ఖడ్గం, కిరీటం, శంఖం, చక్రం, హారం – అనే వీటితో వచ్చాడని తాత్పర్యం. శ్రీరామానుజుల నిర్వాహంలో, **"ఉళ"** – సత్తను పొందాయి – అని తాత్పర్యం. ఒకవేళ ఆళ్వార్ల క్లేశాన్ని చూచి పరమచేతనుడైన భగవంతుడు వాడిపోవచ్చు, అచేతనాలైన వనమాలాదులు ఏ విధంగా వాడిపోయాయి? అంటే, **"సంభాషమాణ మివ సర్వవశంవదేన మందస్మితేన మధురేణ చ వీక్షణేన, దివ్యాస్త్రపుష్పితచతుర్భుజ మత్యుదారం రంగాశ్రయం మమ శుభాశ్రయ**

**మాశ్రయామః"** (అందఱిని వశీకరించుకొనే, మాటలాడుతున్నట్లుండే మంద స్మితంతో, మధురమైన వీక్షణంతో చాలా గొప్పగా ఉండేవాడు, దివ్యాలైన ఆయుధా లతో పుష్పించినట్లుండే నాల్గు భుజాలను కలవాడు, నా మంచికి ఆశ్రయమైన శ్రీరంగనాథుని ఆశ్రయిస్తాము) అనే విధంగా భగవత్సంశ్లేషంవల్ల దివ్యాలైన ఆయుధాలు, ఆభరణాలు వికసిస్తాయి. భగవానునకు క్లేశం కల్గితే అవికూడా వాడిపోతాయి కదా! **"హేతిభిశ్చేతనావద్భిః జయస్వనముదీరితమ్"** అని చేతనాలైన దివ్యాయుధాలు మంగళాశాసనం పలికాయని కదా మహాకవి కాళిదాసు వాక్కు ఆழ்్వార్లు సైతం **"కరుదుమిడమ్ పొరుదు పునల్"** అని శ్రీ సుదర్శనం భగవానుని మనస్సును తెలిసి, అక్కడకు వెళ్ళి శత్రుసంహారం చేస్తాడని అన్నారు. ఇది మిగిలిన ఆయుధాలకు కూడా ఉపలక్షణం. పన్నీరాయిరప్పడి, ఒన్బదిరాయిరప్పడి, ఇరుపత్తునాలాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజనిర్వాహానుగుణంగా వ్యాఖ్యానింపబడింది.

ప్రకృతంలో రామానుజులు చేసిన నిర్వాహం ప్రబంధారంభంలోని **"తుయ రఱుశుదరడి"** అనే ప్రయోగానికి వారుచేసిన, పరమాత్మ ప్రాధాన్యాన్ని సూచించే నిర్వాహానికి అనుగుణం కావడం గమనించాలి. ఆழ்్వార్ల విరహం వల్ల భగవానునికి ఆభరణాదులు సత్తను కోల్పోయి, వారితో చేరిన తర్వాత అవి సత్తను పొందాయని అనడం వల్ల **"భృశం భవతి దుఃఖితః"** అనే సూక్త్యర్థం అనుసంధింపబడడం కూడా గమనించవచ్చు.

## భగవదనుభవం క్షణమైనా చాలు

**10)** **2-9-8 ఈడు వ్యాఖ్యానమ్**

**(ఎక్కాలమిత్యాది - ఇదుక్కు ఆళనందార్ అరుళిచ్చెయ్యుమ్బడి - "ఇని క్కూఱిడ వొణ్ణాదపడి శిఱు కూఱాన అత్యల్పకాలత్తిలుమ్, నీ స్వామియాన ముఱై తప్పాద పడి ఎన్ హృదయత్తిలే వన్దు పుకుఱప్పెఱిల్, మఱ్ఱెక్కాలత్తిలుమ్ ఇదొழ்ిన్ద ఎల్లా కాలత్తిలుమ్, యాదొన్రుమ్ వేణ్డేన్, పిన్నై యితు తానుమ్ వేణ్డేన్".... ఇత్తై ఎమ్బెరుమానార్ కేట్టరుళి, "ఇదు పొరుళ్ అழ்ాకియదు. పిరాదొழ்ియిలుమ్ శిఱుక క్కోలమాట్టార్. ఇజ్గనే యాకవేణుమ్ - ఎన్రరుళిచ్చెయ్‌వర్". (ఎక్కాలత్తు-**

**ఇత్యాది) – ఎల్లా క్కాలత్తిలుమ్ ఎనక్కు శేషియాన నీ, నాన్ శేషమాన ముఱై తప్పామే వన్దు ఎన్ హృదయత్తిలే పుకుర ప్పెఱిల్, ఎక్కాలత్తిలుమ్ – ఇక్కాలమెల్లా వఱ్ఱిలుమ్, (మఱ్ఱు యాదొన్రుమ్ వేణ్డేన్) – ఉన్నై యొழிన్ద మఱ్ఱొన్రైయుమ్ నాన్ వేణ్డేన్",**

**(ఎక్కాలమిత్యాది** – దీనికి ఆళవందార్ పల్కిన రీతి (వివరణం) ఏమంటే – "ఇక ఇంతకంటే చిన్న విభాగం చేయడానికి సాధ్యం కానట్లుగా ఉండే అత్యల్ప భాగమైన కాలంలో అయినా నీవు స్వామి అయిన క్రమం తప్పనట్లుగా నా హృదయంలోకి వచ్చి ప్రవేశిస్తే, **(మఱ్ఱైక్కాలత్తిలుమ్)** – ఈ సమయంకాక మిగిలిన అన్ని సమయాలలోను – ఏ సమయంలోను, **(యాదొన్రుమ్ వేణ్డేన్)** – తరువాత దీనినే కోరతాను ఇక దేనినీ కోఅను" – అని. ఈ అర్థాన్ని శ్రీరామానుజులు విని, "ఈ అర్థం బాగున్నది. అయితే, ఈ ఆழ்వార్ల స్వభావానికి పొసగదు. పొందగల్గినా, పొందలేక పోయినా, ఆழ்వార్లు కోరేది కొంచెంగా కోరరు. అందువల్ల ఇక్కడ ఈ విధంగా అర్థం చెప్పాలి". **(ఎక్కాలత్తిత్యాది)** – అన్ని కాలాలలో నాకు శేషివి అయిన నీవు, నేను శేషత్వక్రమాన్ని తప్పని రీతిలో వచ్చి, నా హృదయంలో ప్రవేశించగల్గితే, **(ఎక్కాలత్తిలుమ్)** ఇక ఏ కాలంలో అయినా, **(మఱ్ఱు యాదొన్రుమ్ వేణ్డేన్)** – నిన్ను తప్ప ఇక దేనినీ నేను కోరను – అని అర్థాన్ని చెప్పాలి.)

**"ఎక్కాలత్తైయాయ్ ఎన్నుళ్ మన్నిల్, మఱ్ఱు ఎక్కాలత్తిలుమ్ యాదొన్రుమ్ వేణ్డేన్"** అని ఆழ்వార్లు పల్కిన సూక్తిని వివరించే నమ్బిళ్ళై ఈడువ్యాఖ్యలో ఆళవందార్, శ్రీరామానుజులు చేసిన నిర్వాహాలను రెండిటిని ప్రస్తుతించారు.

ఇక్కడ ఆళవందార్ పల్కిన అర్థనిర్వాహం ఏమంటే – ఇంతకు మించిన చిన్న విభాగం లేదు – అనే విధంగా చాలా చిన్న విభాగమైన అత్యల్ప కాలంలో, నాకు స్వామిగా నా హృదయంలోకి వచ్చి ప్రవేశిస్తే, (అదే చాలు), ఈ అత్యల్ప భాగమైన కాలంలో తప్ప, మఱి మిగిలిన ఏకాలంలోను దేనిని కూడా కోరను, ఆ విధంగా నీవు ప్రవేశించినదానినే సదా స్మరిస్తూ ఉంటాను. మిగిలిన అన్ని కాలలో దానిని కూడా మళ్ళీ పొందాలని కోరను – అని ఆழ்వార్లు పల్కుతున్నారు– అని.

దీనికి తగిన లౌకికోదాహరణం ఏమంటే – బాగా దాహంతో ఆర్తిని పొందినవాడు "ఒక్కసారి కొంచెం చల్లటి నీరు లభిస్తే చాలు" అని కోరినట్లే ఇది కూడా. (ఆఴ్వార్లు, అల్పకాలమైనా భగవానుడు తమ హృదయంలోకి వచ్చి నిలిస్తే చాలునని అంటున్నారు – అని ఆళవందార్ నిర్వాహం). కనుక ఈ నిర్వాహం ఆఴ్వార్ల ఆర్త్యతిశయాన్నిబట్టి చేయబడింది.

ఈ వివరణను విని శ్రీరామానుజులు – "ఈ నిర్వాహం బాగున్నది. కాని, ఆఴ్వార్ల స్వభావానికి పొసగనిది. ఎందుకంటే, ఆఴ్వార్లు దేనిని కోరినా అల్పంగా కోరరు. అది లభించినా లభించవచ్చు. లేకపోతే, లభించకపోవచ్చు. అందుచేత, ఇక్కడ అర్థాన్ని ఈవిధంగా పలకాలి. అన్ని కాలాలలో నాకు స్వామిని అయిన నీవు నా హృదయంలోకి వచ్చి ప్రవేశిస్తే, ఈ కాలంలో, మఱి ఏ ఇతరకాలంలో నిన్ను తప్ప వేఱు దేనినీ కోరను – అని ఆఴ్వార్లు పల్కుతున్నారు – అని అర్థనిర్వాహాన్ని చేయాలి" – అని శ్రీరామానుజుల అభిప్రాయం.

ఈ అర్థనిర్వాహం ఆఴ్వార్ల స్వభావానికి ఏవిధంగా పొసగుతుంది? అంటే, తిరువాయ్‌మొఴ్ చివరలో **"శూఴ్‌న్దు అకన్డు"** (10–10–10) అనే పాశురం తమ ఆర్తి తత్త్వత్రయాన్ని సైతం కబళీకరించే రీతిలో చాలా పెద్దది – అని అన్నారు కదా! అందువల్ల వారు ఏది కోరినా వారి ఆర్తికి తగినట్లుగానే కదా ఉంటుంది. కనుక ఈ రెండు అర్థనిర్వాహాలు **"ఎక్కాలత్తిలుమ్", "యాదొన్డుమ్"** అనే పదాలలోని సర్వనామ శబ్దాలకు అర్థాలను గ్రహించడంలోని తారతమ్యాన్ని బట్టి ఏర్పడ్డాయి.

**"ఎక్కాలత్తిలుమ్"** – అనే ప్రయోగానికి – శ్రీరామానుజుల నిర్వాహంలో– అన్ని కాలాలలో– అని, ఆళవందార్ నిర్వాహంలో – అత్యల్పకాలంలో – అని అర్థం. ఇది **"ఏ"** అనే సర్వనామ పదప్రయోగం ద్వారా లబ్ధం. **"మఱ్ఱు యా దొన్డుమ్"** అంటే – దీనిని కూడా – అన ఆళవందార్ నిర్వాహంలో, భగవానుని కంటే అన్యమైన పురుషార్థాలు ఏవీ – అని అర్థం. యామునుల నిర్వాహంలో – పాశురంలో ఉత్తరార్ధపూర్వకమైన పూర్వార్ధానుసంధానంగా సమన్వయం చేయబడింది. శ్రీరామానుజుల నిర్వాహం – **"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి**

**నాన్యద్విజానాతి స భూమా"** (దేనిని అనుభవించిన తరువాత ఇంకొక దానిని చూడడో, ఇంకొకటిని వినడో, ఇంకొకటిని తెలియడో, అదే భూమ) (ఛాందో– 7–24) అనే శ్రుత్యర్థానికి అనుగుణం. ఇందువల్ల శ్రీరామానుజుల అర్థనిర్వాహం భగవానుని స్వభావానికి కూడా పొసగేది. పరమపురుషార్థమైన భగవదను భవాన్ని పొందిన తరువాత **"అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే"** (అచ్యుతుని పదాంబుజాలనే బంగారంలోని ఆశచేత మిగిలిన వానిని తృణంగా తలిచారు) అన్నట్లు మిగిలినవి అన్నీ తృణప్రాయాలే కదా. ఈవిధంగా శ్రీరామానుజుల వివరణం అనుభోక్త అయిన ఆ*ழ్*వ్వార్ల స్వభావానికే కాక అనుభావ్యుడైన భగవానుని స్వభావానికి కూడా అనుగణం. ఉభయవేదాంతైక కంఠ్యానుగుణంకూడా. శ్రీరామానుజుల అర్థ నిర్వాహాలన్నీ, జాగ్రత్తగా గమనిస్తే, ఇంచుమించుగా అన్నీ, ఈ రీతిలో ఉభయవేదాంతసమన్వయాత్మకాలుగానే ఉంటాయి. **"తమిళ్ మఱైకళ్ ఆయిరమ్"** అయిన తిరువాయ్‌మొ*ழ్*ని కన్నతల్లి నమ్మా*ழ్*వార్లు అయితే, దానిని తమ అద్భుత సమన్వయాలతో వృద్ధిచేసిన **"ఇదత్తాయ్"** ( హితపరురాలైన తల్లి ) కదా, శ్రీరామానుజులు.

ఈ ఐతిహ్యం ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో కూడా చూపబడింది. పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలో **"ఏదేను మల్పకాలత్తిలే యాకిలుమ్ ఎన్ నెఞ్జిలే ప్రకాశిక్కప్పెటిల్ ఇదొ*ழ్*య ఎల్లా క్కాలత్తిలుమ్ ఏతేనుమ్ ఒన్రైయుమ్ ఉన్నై నాన్ అపేక్షియేన్"** (ఏ కొంచెం అల్పకాలంలో అయినా నా మనస్సులో ప్రకాశిస్తే దీనిని తప్ప అన్ని కాలాలలో దేనినీ ఒక్కటి కూడా నిన్ను కోరను) అని కొంత శ్రీరామానుజ నిర్వాహానుసారంగా వివరింపబడగా, ఒన్బది నాయిరప్పడిలో **"పిన్నై ఒరు కాలముమ్ అతువుమ్ వేణ్డా"** అని మొదట యామున నిర్వాహాను సారంగా పల్కి, **"ఎల్లాక్కాల ముమాకవుమామ్"** అని శ్రీరామానుజ నిర్వాహపరంగా కూడా అర్థం చెప్పారు. ఇరుపత్తు నాలాయిరప్పడి అవతారిక యామున నిర్వాహానుగుణంగా చూపబడింది. ఆఱాయిరప్పడిలో కూడా శ్రీరామానుజ నిర్వాహానుసారంగానే వివరింపబడింది.

## దివ్యక్షేత్రాలను చేరడం కూడా ప్రాప్యమే

## 11) 2-10 - ఈడు వ్యాఖ్యాన ప్రవేశం

**"కీழ్, ఎమ్మావీట్టిలే నిష్కర్షిత్త ప్రాప్యమ్ పెఱుకైక్కు తిరుమలైయే ఆశ్రయిక్కిఱార్" - ఎన్ఱు ఆళవందార్ అరుళిచ్చెయ్‌దారాక త్తిరుమాలై యాణ్డాన్ పణిక్కుమ్బడి.**

**ఎమ్బెరుమానార్ - "అజ్గనల్ల, ఇవర్ పాట్టుత్తోఱుమ్" ఒల్లై ఒల్లై - ఎన్ఱుమ్, "కాలక్కழிవు శెయ్యేల్" ఎన్ఱుమ్ త్వరిక్కప్పుక్కవాఱే, "నమక్కుమ్ అతివిత్తు, నాముమ్ ఇవర్ కారియమ్ శెయ్యక్కడవదాక అఱుదియిట్టాల్, శరీరసమనంతరమ్ పేఱు తప్పాదు - ఎన్ఱు అఱుదియిట్టిరుక్కలాయిరుక్క, ఇవర్ ఇప్పడి త్వరిక్కిఱదు ఇశ్శరీరత్తోడే అడిమై కొళ్ళవేణుమెన్ఱుపోలే యిరున్దదు. ఇని, ఇవర్క్కు నామ్ నినైత్త పడి పరిమాఱు కైక్కు ఏకాన్తమాన దేశమ్ ఏదో?" ఎన్ఱు ఞాలత్తూడే నడన్దుழక్కి ప్పార్త్తు వరచ్చెయ్‌తే, "ఇవ్విడమ్ శాల ఏకాంతస్థలమా యిరున్దదు" ఎన్ఱు తిరుమలై యిలే సన్నిధిపణ్ణి యరుళి, "నామ్ ఉమక్కు ముకమ్ తరుకైక్కాక వన్దు నిఱ్కిఱోమ్. నీర్ ఇజ్గే వన్దు నినైత్త వకైకళ్ ఎల్లామ్ పరిమాఱి అనుభవియుమ్." ఎన్ఱు తెఱుత్తిరు మలైయిలే నిఱ్కిఱ నిలైయిలే క్కాట్టి క్కొడుక్క, ఇవరుమ్ అత్తై అనుసంధిత్తు, భగవాన్ ప్రాప్యమానాల్, అవన్ వర్త్తిక్కుమ్ దేశముమ్ ప్రాప్య మాకక్కడవదిఱే! అత్తాలే, తిరుమలైయోడు, అత్తోడుశేర్న్ద అయన్‌మలై యోడు, పుఱమలైయోడు, తిరుప్పతి యోడు, పోమ్ వழிయోడు పోకక్కడవోమ్ - ఎన్ఱు తుణియుమ్ తుణివోడు వాశియఱ ప్రాప్యాంతర్గతమాయ్ అనుభవిత్తు, ఇనియరాకిఱార్" - ఎన్ఱు.**

(ఇంతకు ముందు, **"ఎమ్మావీడు"** అనే దశకంలో **"తనక్కేయాక ఎనై క్కొళ్ళు మీదే"** (నీ కోసమే నన్ను స్వీకరించు) అని నిష్కర్షించిన ప్రాప్యాన్ని (భగవత్ కైంకర్యాన్ని) పొందడానికి దక్షిణదిశలోని తిరుమాలిరుమ్‌శోలై పర్వతాన్ని ఆழ్వార్లు ఆశ్రయిస్తున్నారు" - అని ఆళవందార్ పలికేవారని తిరుమాలై - యాణ్డాన్ అనేవారు.

శ్రీ రామానుజులు "ఆ విధంగా కాదు, ఆழ్వార్లు ప్రతి పాశురంలోను **"ఒల్లై ఒల్లై"** అని, "కాలయాపనను చేయవద్దు" అని తొందరపడగానే, "ఆழ్వార్లు

నాకు తమ మనోరథాన్ని తెలిపి, నేను కూడా వీరి కార్యాన్ని చేయాలని నిశ్చయించుకొన్న తరువాత, "ఈ శరీరపతనానంతరం ప్రాప్యసిద్ధి తప్పదు" అని ఆళ్వార్లు మనస్సులో నిశ్చయించుకొనవలసి ఉండగా, ఆ విధంగా కాకుడా, వీరు ఈ రీతిలో త్వరపడడాన్నిబట్టి – ఈ శరీరంతోనే కైంకర్యాన్ని చేయాలి – అని వీరు ఆశపడినట్లుగా తోస్తున్నది. అందువల్ల వీరు తలచినట్లుగా కైంకర్యాన్ని చేయడానికి ఏకాంతమైన దేశం ఏదో? – అని భగవానుడు భూమి అంతటా తిరిగి శ్రమపడి, గమనించి చూడగా, "ఈచోట చాలా ఏకాంతస్థలంగా ఉన్నది" అని తిరుమాలిరుమ్ శోలై పర్వతంపై వేంచేసి ఉండి, "ఆళ్వార్లు! మీకు దర్శనాన్ని అనుగ్రహించడంకోసం ఇక్కడకు వచ్చి ఉన్నాను. మీరిక్కడకు వచ్చి, మీరు తలచిన రీతులన్నిటిలో నన్ను సేవించి, ఆనందించండి" అని దక్షిణ తిరుపతి అయిన తిరుమాలిరుమ్ శోలైలో తాను వేంచేసి ఉండే సన్నివేశాన్ని ఆళ్వార్లుకు దర్శింపజేయగా, వీరు (ఆళ్వార్లు) కూడా దానిని దర్శించారు, భగవంతుడు ప్రాప్యుడైనపుడు, అతడుండే దేశంకూడా ప్రాప్యమవుతుంది కదా! అందువల్ల ఆ తిరుమలతో పాటు, దానితో చేరి ఉండే సమీప పర్వతంతో పాటు, అక్కడకు ప్రయాణం చేసే మార్గంతో పాటు, వెళ్ళాలనే నిశ్చయంతో పాటు, తేడా లేకుండా అన్నిటిని ప్రాప్యా కోటిలోకి చేరినవిగా ఆళ్వార్లు అనుభవించి ఆనందిస్తున్నారు – అని అర్థనిర్వాహాన్ని చేశారు.)

**"ఎమ్మావీడు"** (2–9) అని ప్రారంభమయ్యే గడచిన దశకంలో ఆళ్వార్లు **"తనక్కేయాక ఎనై క్కొళ్ళుమ్, ఈదే యాన్ ఉన్నై"** (నీ కోసమే నన్ను పరిగ్రహించు. ఇదే నిన్ను కోరేది) ఇత్యాదిగా ప్రాప్యనిష్కర్షను చేశారు. తరువాత, **"కిళరొళి"** (2–10) అనే దశకంలో తిరుమాలిరుమ్ శోలై పర్వతంపై వేంచేసి ఉండే స్వామిని, తిరుమలను (పర్వతాన్ని) దర్శించి ఆళ్వార్లు ఆనందిస్తున్నారు. ఈ రెండు దశకాల మధ్య గల అర్థసంగతిని గూర్చి ఆళవందార్, శ్రీరామానుజులు చేసిన నిర్వాహాలను నమ్పిళ్ళై తమ ఈడు వ్యాఖ్యలో ప్రస్తావించారు.

ఆళవందార్ చేసిన అర్థనిర్వాహం ప్రాపకపరం. తాము గత దశకంలో నిష్కర్షించిన ప్రాప్యాన్ని ( కైంకర్యాన్ని ) పొందడానికి ఆ స్వామియే ఉపాయంగా కావాలా? **"శమన్ కొళ్ వీడు తరుమ్ తడమ్ కున్రమ్"** (పరమసామ్యాపత్తిని కల్గించే చల్లని పర్వతం) అనేవిధంగా ఆ భగవంతుడు అభిమానించిన పర్వతమే

ప్రాప్యసిద్ధికి ఉపాయంగా చాలదా? – అని తిరుమలను ఉపాయంగా ఆழ్వార్లు ఆశ్రయిస్తున్నారు – అనే ఆళవందార్ నిర్వాహం పాపక పరం. ఇది, **"శార్వదు శదిర్"** అని, **"తిరుమలై యదువే అదైవదు తిఱమ్"** అని గల ప్రయోగాలను దృష్టిలో పెట్టుకొని చేయబడింది. **"కీழ్‌మై శెయ్యాదే కిఱియెన నినైమిన్"** (విషయాంతర ప్రావణ్యమనే నైచ్యాన్ని విడచి, దీనిని మంచి ఉపాయంగా భావించండి) అనే ప్రయోగంలోని **"కిఱి"** అనే పదంలో (మంది ఉపాయం) దృష్టి.

ఇక, శ్రీరామానుజుల నిర్వాహం ప్రాప్యపరం. ఈ నిర్వాహం. **"పదియతు వేత్తి ఎழువదు పయనే"** (తిరుమాలిరుమ్‌శోలై తిరుపతిని కీర్తించి, అధిరోహించడమే ఉజ్జీవించడమే పరమ ప్రయోజనం). **"పోదవిழ్ మలైయే వుకువదు పొరుళే"** (పూలు వికసించే వనాద్రిని చేరడం పరమ పురుషార్థం). అనే సూక్తులను దృష్టిలో పెట్టుకొని చేయబడింది. ఈ దశకంలో ఆழ్వార్లు పరమ ప్రాప్యమైన కైంకర్యాన్ని కోరుతున్నారు కనుక, శ్రీరామానుజుల నిర్వాహం మరింత ప్రకరణానుగుణం. తిరుమాలిరుమ్ శోలై చాలా ఏకాంతస్థలమనే సూక్తికి **"ఆయిర మాఱుకళుమ్ శునైకళ్ పల ఆయిరము మాయిరమ్ పూమ్ పొழిలు ముదైయ మావిరుమ్ శోలైయదే"** (పెరియ తిరు–4–3–11) (వేయి నదులు, కొండ వాగులు వేయి, వేయి పూల తోటలు కల తిరుమాలిరుమ్ శోలై) అనే తిరుమంగైమన్నన్ పల్కిన సూక్తి వివక్షితం. ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలోకూడా ఈ నిర్వాహాలు రెండు ప్రస్తుతాలు. ప్రాపకపరంగా, ప్రాప్యపరంగా చేయబడిన శ్రీయామున, శ్రీరామానుజుల నిర్వాహాలు రెండిటికి ఆధారం ప్రథమ పాశురమని కూడా చెప్పవచ్చు. **"తళర్విల రాకిల్"** అనే మొదటి పాశురంలోని ప్రయోగాన్ని నమ్బిళ్ళై– **"సర్వప్రకారత్తాలుమ్ వరుమనర్థ మాకిఱదు – తిరుమలైయై కిట్టామై – ఎన్నిరుక్కిఱార్. తిరుమలై ప్రాప్యమ్ – ఎన్నుమ్ బుద్ధి పిఱన్దు లభిక్కైక్కు విరోధియాయ్ వరుమనర్థ భాగికళన్నియే ఒழియవేణ్డిల్"** (అన్ని విధాలుగా వచ్చే అనర్థం – తిరుమలైను చేరక పోవడమే – అని భావిస్తున్నారు. తిరుమా లిరుమ్ శోలై పర్వతం ప్రాప్యం – అనే బుద్ధి కల్గి, పొందడానికి విరోధియై, వచ్చే అనర్థాన్ని కలవారు కాకుండా ఉండడంకోసం) అని ప్రాప్య, ప్రాక పరంగా వ్యాఖ్యానించడం దీనికొక ఉదాహరణం. దుఃఖాన్ని కలవారు కాకుండా ఉండాలంటే – అని శ్రీయామునుల

నిర్వాహంలో భావం. అనర్థాన్ని కలవారు కాకుండా ఉండాలంటే – అని శ్రీరామానుజుల నిర్వాహంలో భావం. ఈ నిర్వాహంలో దుఃఖాన్ని తెలిపే **"తళర్వు"** అనే శబ్దం దుఃఖహేతువు అయిన పాపాన్ని లక్షిస్తుంది. వనగిరిని చేరకపోవడమనే దుఃఖాన్ని కలవారు కాకుండా ఉండడం కోసం– అని మొదటి నిర్వాహంలో, వనగిరిని చేరడంలో అడ్డుగా ఉండే పాపాన్ని కలవారు కాకుండా ఉండడం కోసం – అని రెండవ నిర్వాహంలో తాత్పర్యం. ఈ విధంగా ఈ పాశుర వ్యాఖ్యలో ప్రాప్యపరంగా ప్రాపకపరంగా కన్పించే వాక్యాలను రెండు నిర్వాహాలకు తగినట్లు అర్థాన్ని గ్రహించాలని కూడా అరుంబద వివరణంలో తెలుపబడింది. ఇందువల్ల శ్రీరామానుజ, శ్రీయామునుల నిర్వాహాలకు రెండిటికి ప్రథమ పాశురమే మూలమని అనవచ్చు. ఆచార్య హృదయ కారులు మాత్రం తిరువాయ్మొ*ళ్ళి*లోని ద్వితీయ శతక సారాన్ని తెల్పుతూ – **"ప్రదక్షిణగతిచింతనాద్యంగమాక్కుకిఱార్"** అని ప్రాపకపరంగా పలికారు. శ్రీవరవరమునులు తిరువాయ్మొ*ళ్ళి* నూ*ర్ఱ*న్దాదిలో ఈ దశక సారాన్ని తెలిపే పాశురంలో **"తళర్వుఅవే నెఞ్జై వైత్తు చ్చేరుమ్"** అని ప్రాప్యపరంగా, ప్రాపకపరంగా – రెండు విధాలుగా అన్వయించే టట్లు పదప్రయోగాన్ని చాతుర్యంగా చేశారు. శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తమ వ్యాఖ్యలో ఈ విషయాన్ని తెలిపారుకూడా. వేదాంత దేశికులు ద్రమిడోపనిషత్ తాత్పర్య రత్నావళిలో **"అభ్రూత భోగ్యం ద్వితీయే"** అని ప్రాప్యపరంగా ద్వితీయ శతక ప్రమేయాన్ని తెలుపగా, ద్రమిడోపనిషత్ సంగతి కారులు కూడా ఈ దశకాన్ని **"ప్రాప్యం తమేవ చ తదన్వయినం చ సర్వమ్"** అని శ్రీరామానుజులనిర్వాహానుసారంగా ప్రాప్యపరంగా పలికారు.

## కర్మపాశన విమోచనం కోసం కొండను ఆశ్రయించాలి

### 12) 2-10-4- ఈడు వ్యాఖ్యానమ్

**ఇతు నమ్మాల్ శెయ్తు తలైక్కట్టప్పోమో? తిరుమలైయై యాశ్రయిక్కుమ తొ*ళ్ళి*య– ఎన్ఱు ఆ*ళ్వా*న్ ఓరురువిలే పణిత్తానామ్. అజ్గనుమ్ నిర్వహిక్క క్కడవతు. అన్ఱిక్కే, "కరుమ వన్ పాశమ్ క*ళ్ళి*క్కైక్కాకవుమ్, ఉ*ళ*న్ఱు ఉయ్కైక్కాకవుమ్" ఎన్ఱు ఇజ్గనే ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి.**

**"కరుమవన్ పాశమ్ కழித్తుழన్తు ఉయ్యవే.... తిరుమలై అదువే అదైవదు తిఱమే"** అనే సూక్తిలోని **"ఉయ్యవే"** అనే పదంలో గల ఏకారాన్ని కూరేశులు, శ్రీరామానుజులు వివరించిన తీరును వ్యాఖ్యాత తెలుపుతున్నారు.

కూరేశులు ఒకసారి ఈ పదానికి అర్థాన్ని వివరించేటపుడు ఈ ఏకారాన్ని అన్యయోగవ్యవచ్ఛేదకంగా గ్రహించి, **"కరుమ్ వన్‌పాశమ్ కழித్తు ఉழన్తు ఉయ్యవే!"** (బలమైన కర్మపాశాలను తొలగించుకొని ఉజ్జీవించడానికి సాధ్యమా!) సాధ్యం కాదు. ఇక సాధ్యం అయేది ఏది? అంటే, తిరుమాలిరుమ్ శోలై పర్వతాన్ని ఆశ్రయించడమే" – అని అర్థం చెప్పారు.

భగవద్రామానుజులు ఈ ఏకారాన్ని నిశ్చయార్థకంగా గ్రహించి, బలమైన కర్మపాశాలను తొలగించుకోవడం కోసం, ఉజ్జీవించడం కోసం తిరుమాలిరుమ్ శోలై పర్వతాన్ని ఆశ్రయించడమే యుక్తం" అని వివరించారు.

మనకు అన్ని కర్మల ఫలాలను అనుభవించి, తీర్చుకొని ఆ తరువాత ఈ పర్వతాన్ని ఆశ్రయించడం – అనేది ఎప్పటికీ వీలు అయే పని కాదు. అది సముద్రంలోని కెఱటాలు శాంతించిన తరువాత స్నానం చేయాలని చూడడం వంటిదే. **"సముద్రే శాంతకల్లోలే స్నాతు మిచ్ఛతి మూఢధీః"** కదా – అన్నది కూరేశుల భావం. తిరుమాలిరుమ్ శోలై పర్వతాన్ని ఆశ్రయించగానే కర్మఫలాలు తనంత తామే నశించిపోయి, భగవానునకు కైంకర్యాన్ని చేసే భాగ్యం కల్గుతుంది – అని శ్రీరామానుజుల భావం.

కూరేశుల నిర్వాహంలో **"ఉయ్యవే"** అనే పదంలోని ఏకారం వ్యతిరేక పర్యవసాయి. ఇది కాకుస్వరంద్వారా లబ్ధం. భగవద్రామానుజుల నిర్వాహంలో నిశ్చయార్థకం. ఇది కూడా కాకుస్వరలబ్ధమే. **"అతిక్షుద్రా వయం స్వయత్నేన కర్మరూప దృఢతరపాశాన్ వినాశ్య భగవత్కైంకర్యం కృత్వా ఉజ్జీవితుం శక్తాః కిమ్? అశక్తా ఏవ. తస్మాత్ వనగిరిసమాశ్రయణ మేవ ప్రాప్త మితి కూరేశనిర్వాహః"**– అని అరుంబదంలో కూరేశ నిర్వాహం తెలుపబడింది. ఇది **"వన్‌పాశమ్"** అనే పదంలోని **"వన్"** అనే విశేషణానుకూలం. భగవద్రామానుజ నిర్వాహం **"పరిత్రాణాయ సాధూనామ్"** అనే గీతా సూక్తికి అనుకూలం. రక్షణ అంటే

ఇష్టప్రాప్తి, అనిష్ట నివృత్తులే కదా! ఆఱాయిరప్పడి, ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలలో భగవద్రామానుజ నిర్వాహం మాత్రమే ప్రస్తావింపబడింది.

కూరేశ నిర్వాహంలో పాశురంలోని **"కరుమవన్ పాశమ్ కழిత్తుழన్ఱు ఉయ్యవే!"** అనేది ఒకవాక్యంగా మిగిలిన భాగం వేఱొక వాక్యంగా గ్రహింపబడింది. ఈ నిర్వాహం **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"** (గుణత్రయరూపమైన, దివ్యమైన మాయ అనే ప్రకృతి దాటరానిది. నన్ను ఎవరు శరణు పొందుతారో, వారే ఈ మాయను దాటుతున్నారు) అనే గీతా శ్లోకానికి అనుగణం. పాశురంలోని **"కరుమ"** (కర్మ) శబ్దం దానికి కారణమైన ప్రకృతిని లక్షిస్తుంది.

శ్రీరామానుజుల నిర్వాహంలో పాశురం అంతా ఒకే వాక్యం. ఈ నిర్వాహ తాత్పర్యాన్ని నమ్బిళ్ళై ఈడులో ఈ విధంగా వివరించారు. **"కరుమవన్ పాశమ్" ఎన్ఱు ఇఙ్గనే ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి. మురాసురన్ అనేక మాయిరమ్ పాశఙ్గళాలే తన్నై మఱైయ పరిన్దుక్కొణ్డిరున్దాప్పోలేయితే, అవిద్యాదికళాలే తన్నై మఱైయ పరిన్దుక్కొణ్డిరుక్కుమ్బడి కర్మ మాకిఱ వలియ పాశఙ్గళై కழిక్కైక్కాకవుమ్, తన్‌పక్కల్ కైంకర్యత్తై ప్పణ్ణి ఉజ్జీవిక్కైక్కాకవుమ్. "పరిత్రాణాయ సాధూనామ్" ఎన్గిఱపడియే విరోధికళై ప్పోక్కి ఉజ్జీవిప్పిక్కైయితే అవతారఙ్గళుక్కు ప్రయోజనమ్"** (కర్మలనే బలమైన పాశాలను తెంచుకోవడం కోసం, పరమాత్మతో పాటు ఆచరిస్తూ కైంకర్యాలను చేయడం కోసం – అని ఈవిధంగా శ్రీరామానుజులు పలికారు. మురాసురుడు పలు వేలబంధాలతో తనకు బంధించుకొన్నట్లుగా, జీవుడు అజ్ఞానాదులతో తనకు బంధించుకొంటాడు. ఈ కర్మలనే బలమైన పాశాలను తెంచుకోవడం కోసం, తాను – పరమాత్మకు కైంకర్యం చేసి తరించడం కోసం– అని అర్థం. **"పరిత్రాణాయ సాధూనామ్"** అని అవిద్యాది విరోధుల్ని పోగొట్టి తరింపజేయడమే కదా భగవదవతారాలను ప్రయోజనం)

పాశురంలో **"ఉకన్దు"** అనే దానికి సంచారమని అర్థం. **"యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి"** (ఏయే మార్గంలో పరమాత్మ వెడతాడో, ఆయా మార్గంలో ముక్తాత్మ అనుసరించి వెడతాడు) అనే వెంట వెళ్ళి చేసే

కైంకర్యాన్ని ఇది లక్షిస్తుంది. **"త్వం న్యంచద్భి రుదంచద్భిః కర్మసూత్రోపపాదితైః, హరే! విహరసి క్రీడాకందుకైరివ జంతుభిః"** (దారాలతో కట్టబడిన బంతిని బాలుడు కిందకు పైకి వెళ్ళేటట్లు చేస్తూ ఆడుకొనేటట్లే, హరీ! నీవు, కర్మపాశాలతో బంధింపబడిన, బంతి వంటి జీవులతో ఆడుకుంటావు) అనే విష్ణుపురాణశ్లోకం కర్మలను పాశాలుగా పల్కడం గమనించవచ్చు. ఇక్కడ కర్మ అనేది – అవిద్యా వాసనారు ప్రకృతి సంబంధాలను లక్షిస్తుంది. ఆழ்వార్లు కూడా **"తిణ్ణమழுన్ద క్కట్టి ప్పులశెయ్‌వినై వన్‌కయిற్ఱాల్"** (చేసిన పాపాలనే బలమైన దారాలతో గట్టిగా అదిమి కట్టి) అన కర్మలను పాశాలుగా పలికారు. ఈ విధంగా కాకుస్వరంతో అర్థ విశేషాన్ని కూరేశులు పల్కిన వేఱొక సందర్భం కూడా ఇక్కడ స్మరణీయం. ఇరణ్డామ్ తిరువన్దాదిలోని **"తనక్కడిమై పట్టదు తానఱియానేలుమ్ మనత్తిడరై వైప్పదామ్! మాలై"** (భగవంతునకు తాను శేషభూతుడనే విషయాన్ని తాను తెలియ లేక పోయినా, మనస్సులో అతనిని నిలుపుకోవడం యుక్తం) అనే పాశురంలో **"మనత్తిడరై వెప్పదామ్!"** అనే ప్రయోగాన్ని కాకుస్వరయుక్తంగా గ్రహించి, "మనస్సులో నిలుపుకోవడం స్వప్రయత్నంతో సాధ్యమా!" అనే అర్థాన్ని చెప్పడం ఇక్కడ ఉదాహరణగా చెప్పవచ్చు.

## ఏనాడూ నిన్ను నేను పొందగలనో తెలుపు

### 13) 3-2-1 – ఈడు వ్యాఖ్యానమ్

**(ఎన్నాళ్ యాన్ ఉన్నై! ఇని వన్దు కూడువనే) – "ఇని వన్దు కిట్టుకై – ఎన్ఱు ఒరు పొరుళుణ్డో! – ఎన్ఱు నిరాశరాకిఱార్ – ఎన్ఱు మున్బుళ్ళ ముదలికళ్. ఎమ్బెరు మానార్ – నిరాశరానాల్ ముడివార్ ఒరువర్. ఒన్బదామ్ పాట్టిల్ నిరాశరాక, పత్తామ్ పాట్టిల్ అవన్ వన్దు సమాధానమ్ పణ్ణినానాక అమైయుమ్" – ఎన్ఱు అరుళిచ్చెయ్‌దార్".**

(**ఎన్నాళ్ యాన్ ఉన్నై! ఇని వన్దు కూడువనే** – ఇక స్వామి వద్దకు వచ్చి సమీపించడమనే విషయం ఒకటి ఉన్నదా! – అని ఆழ்వార్లు నిరాశపడుతున్నారు– అనేది శ్రీరామానజులకు ముందున్న ఆచార్యుల నిర్వాహం. శ్రీరామానుజులు "ఈ ఆழ்వార్లు నిరాశపడితే ఇక జీవించని స్వభావం కలవారు. తొమ్మిదవ పాశురంలో

ఆళ్వార్లు నైరాశ్యాన్ని పొందగా, పదవ పాశురంలో భగవంతుడు వచ్చి, వారికి ఉపశమనం కల్గించాడని పల్కడం తగినది" – అని అన్నారు)

**"ఎన్నాళ్ యానున్నై ఇని వన్దు కూడువనే?"** (ఏనాడు నేను నిన్ను ఇక సంశ్లేషించగలను?) అని ఆళ్వార్లు పలికిన సందర్భాన్ని వివరిస్తూ వ్యాఖ్యాత నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యలో రెండు విధాలైన అర్థ నిర్వాహాలను గూర్చి ప్రస్తావించారు.

"ఇక నేను నీవద్దకు వచ్చి నిన్ను కలువడమనేది లేదు" అని ఆళ్వార్లు మనస్సులో తల్లడిల్లుతూ పల్కుతున్నారు – అని శ్రీరామానుజులకు ముందున్న ఆళవందార్ మొదలైన పూర్వాచార్యులు ఇక్కడ అర్థాన్ని నిర్వహించారు.

శ్రీరామానుజులు ఈ విధంగా కాకుండా, వేఱొక రస్యమైన, ఆళ్వార్ల స్వభావానికి తగిన అర్థనిర్వాహాన్ని చూపించారు. "ఆళ్వార్ల స్వభావం ఎటువంటిది? అంటే – పూర్తిగా నైరాశ్యాన్ని పొందితే ఇక జీవించని స్వభావం కలవారు. ఆర్త ప్రపన్నులు కదా, ఆళ్వార్లు. అందువల్ల తరువాత పాశురాలను అనుగ్రహించే అవకాశమే లేదు. కనుక ఆళ్వార్లు పూర్తిగా నిరాశను పొందారని అనడం కంటే వేఱు విధంగా పాశురానికి అర్థాన్ని పల్కడం సరసం. ఈ పాశురం తరువాత ఇంకా తొమ్మిది పాశురాలను ఆళ్వార్లు పలికారు కదా! "ఈనాడే నేను నీ శ్రీచరణ సన్నిధిని చేరాలనే గొప్ప ఆర్తితో ఉండే నేను నిన్ను ఏనాడు కూడగలను?" – అని మొదటి పాశురంనుండి తొమ్మిది పాశురాలవరకు ఆళ్వార్లు భగవంతుని ప్రశ్నించారు. అతడేమీ బదులు పల్కనందున మనస్సులో మిక్కిలి పరితాపాన్ని పొందగా, పదవ పాశురంలో స్వామి వచ్చి వారికి మానసికంగా సాక్షాత్కారాన్ని అనుగ్రహించి ఉపశమనం కల్గించాడు. అపుడు ఆళ్వార్లు ఆనందించి, **"అవ్వల్ల లెల్లామ్ అకల కలైప్పల్ ఞానత్తెన్ కణ్ణనై క్కణ్డుకొణ్డు నిలై పెఱ్ఱు ఎన్నెఞ్జమ్ పెఱ్ఱదు నీడుయిరే"** – (ఆ దుఃఖం అంతా తీరేటట్లు పలు వేదాలచే ప్రతిపాద్యుడైన నా శ్రీకృష్ణుని దర్శించి నా మనస్సు ఒకవిధంగా ఓదార్పును పొందు ధరించింది. అచ్ఛేద్యమై, అదాహ్యమై ఉండే ఆత్మవస్తువు నశించిపోతుందా! అనే దశను చేరి, ఇపుడు నిత్యత్వాన్ని పొందింది– అంటే – దాస్య సిద్ధిని పొందింది) – అని పలికారు– అని వివరించడం యుక్తం – అనే అర్థనిర్వాహాన్ని చేశారు.

**"తమి<u>ఝ్</u>మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శఠకోపన్ మొయ్‌మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** (ద్రావిడ వేదరూపాలైన తిరువాయ్‌మొ<u>ఝి</u> ప్రబంధంలోని వేయి పాశురాలను కన్నతల్లి శఠకోపులు. దానిని చక్కగ పెంచి పోషించిన పెంపుడు తల్లి శ్రీరామానుజులు) అని కీర్తింపబడే శ్రీరామానుజుల మధురార్థ నిర్వాహాలలో ఇది ఒకటి. పన్నీరాయిరప్పడి, ఇరుపత్తునాలా యిరప్పడి, ఒన్బది నాయిరప్పడి వ్యాఖ్యలలో శ్రీరామానుజ నిర్వాహాను గుణంగానే వివరింప బడింది. (ఎన్నాళ్) – **"ఇన్నాళ్" ఎన్ఱు ఓరవధి పెఱ్<u>గ్</u>రారాకిలుమ్, ప్ప<u>ఱ్</u>ఱ<u>ి</u>క్కొణ్ణిరుప్పర్"** (ఈనాడు అని ఒక అవధిని పొందినా, దానిని ఆశ్రయించి ఆశ్వాసాన్ని పొందుతారు) అని ఇరుపత్తు నాలాయిరప్పడిలో వివరింపబడడం గమనించవచ్చు.

**"ఎన్నాళ్ యానున్నై ఇని వన్దు కూడువనే!"** అనే సూక్తిని పూర్వాచార్యులు కాకుస్వరంతో కూడినదిగా గ్రహించి, క్షేపోక్తిపరంగా అంటే – ఇక ఏనాటికీ నిన్ను నేను చేరలేను – కదా! అర్థం చెప్పారు. శ్రీరామానుజులు ప్రశ్నార్థకంగా గ్రహించి, అర్థం చెప్పారు. **"కాలో వ్యక్తిః స్వరాదయః... విశేషస్మృతిహేతవః"** – అని స్వరం కూడా విశేషార్థ ప్రతిపాదకమని ఆలంకారికసూక్తి. మన పూర్వాచార్యులు పద – పదాంశాలను, ఉపసర్గ, విభక్తులను ఆధారంగా చేసికొని అర్థవిశేషాలను నిర్వహించడమే కాక, స్వరవిశేషాన్నిబట్టి కూడా విశేషార్థనిర్వహణను చేశారనే విషయానికి ప్రకృతనిర్వాహ మొక ఉదాహరణ. ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో కూడా శ్రీరామానుజ నిర్వాహాన్ని అనుసరిస్తూ వివరింపబడింది. గమనిస్తే, శ్రీరామానుజుల అర్థనిర్వాహం ఉభయ వేదాంత సమన్వయాత్మకమని తెలుస్తుంది. **"ఎన్నాళ్ యాన్ ఉన్నై కూడువనే?"** (ఏనాడు నేను నిన్ను కలువగలను? "అనే ప్రయోగాన్ని శ్రీరామానుజులు ప్రశ్నార్థకంగా గ్రహించి, ఆ<u>ఝ్</u>వార్లు భగవానుని ఉద్దేశించి "నేను నిన్ను ఎపుడు చేరగలనో, ఆనాడు నాకు నిర్దేశించి తెలియజేయాలి" అని ప్రశ్నిస్తున్నారనే అర్థాన్ని తెలిపారు. ఈ విధంగా ఆ<u>ఝ్</u>వార్లు భగవానుని ప్రశ్నించడానికి – శ్రీరామాయణంలో భరతుడు శ్రీరామునితో **"చతుర్దశే హి సంపూర్ణే వర్షేహని రఘూత్తమ, న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్"** (రఘువంశంలో ఉత్తముడవైన శ్రీరామా! పధ్నాలుగు సంవత్సరాలు పూర్తి అయిన నాడు నిన్ను చూడలేకపోతే, నేను అగ్నిలో ప్రవేశిస్తాను) అని అనగా, శ్రీరాముడు సమాధానంగా,

**"తథేతి చ ప్రతిజ్ఞాయ సంపరిష్వజ్య సాదరమ్, శత్రుఘ్నం చ పరిష్వజ్య"** (ఆ విధంగానే అని మాట ఇచ్చి శ్రీరాముడు భరతుని, శత్రుఘ్నుని కౌగలించు కొన్నాడు) పల్కి, ఆ తరువాత, **"పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః, భరద్వాజా శ్రమం ప్రాప్య"** (పధ్నాలుగేండ్లు పూర్తి అయిననాడు పంచమిలో శ్రీరాముడు భరద్వాజా శ్రమాన్ని చేరి) అనేవిధంగా మాట ఇచ్చిన రీతిలో వచ్చాడు – అనేవిధంగా నీవు కూడా నేనెపుడు నిన్ను కలిసికొనగలనో, ఆ ఫలవ్యాప్తమైన దినాన్ని నిర్దేశించి తెల్పి, ఆ విధంగానే నన్ను ఆనాడు నీదరికి చేర్చుకోవాలని – పల్కుతున్నారు – అని తాత్పర్యమని నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యలో తెలిపారు. **"(ఎన్నాళ్) ఎనక్కు ఇప్పోదే పెఱవేణుమ్ – ఎన్నుమ్ అపేక్షై ఇల్లై. "ఇన్న నాళ్ పెఱక్కడవై" – ఎన్ఱు ఒరునాళిట్టత్తర అమైయామ్, "పూర్ణే చతుర్దశే వర్షే ఎన్నుమాప్పోలే"** (నాకు, ఇపుడే పొందాలనే అపేక్ష లేదు. "ఈనాడు నీవు పొందగలవు" – అని ఒక దినాన్ని నిర్దేశించి పల్కి ఆనాడు నన్ను అనుగ్రహిస్తే చాల. ఏ విధంగా? అంటే – పద్నాలుగేండ్లు పూర్తి కాగానే శ్రీరాముడు భరతుని అనుగ్రహించాడు – అనే విధంగా) అనే ఈడు సూక్తి దీనిని స్పష్టం చేస్తున్నది. ఈ విధంగా శ్రీమానుజ నిర్వాహం శ్రీరామాయణ సూక్తితో అన్వయిస్తున్నందున, ఉభయవేదాంత సమన్వయాత్మకమనేది స్పష్టం. పూర్వుల నిర్వాహంలో మొదటి పాశురం నుండి తొమ్మిదవ పాశురం వరకు నైరాశ్యం, పదవ పాశురంలో భగవానుని వల్ల ఓదార్పు పొందడం తెలుపబడింది భగవద్విషయం ఈడు వ్యాఖ్యానానికి ఉపోద్ఘాత రూపమైన ముదల్ శ్రియఃపతిలో – ఆళ్వార్లకు భరతాழ்వాన్‌కు మధ్య పలువిధాలైన సామ్యాలను నమ్పిళ్ళై నిరూపించారు. ఈ విధంగా నమ్పిళ్ళై పల్కడానికి శ్రీరామానుజులు చేసిన ఇటువంటి అర్థనిర్వాహాలు కూడా దోహద పడ్డాయనడంలో సందేహం లేదు. శ్రీరామానుజులు అర్థనిర్వాహాల ప్రభావం తదనంతర పూర్వాచార్యులపై ప్రసరించిన వైనాన్ని ఇవి తెల్పుతున్నాయి.

## పూర్వోత్తర పాపనిబర్హణం – వేదాంత వాక్య సమన్వయం

## 14) 3-3-6 – ఈడు వ్యాఖ్యానమ్

**(మెయ్‌మ్మేల్ వినై ముற్றవుమ్)..... "కడజ్గళ్ మెయ్‌మ్మేల్ వినై ముற்ற వుమ్, వేమ్ – నశిక్కుమ్" – ఎన్ఱు ఆళవందార్ అరుళిచ్చెయ్యుమ్బడి. ఇత్తై ఎమ్బెరు మానార్ కేట్టరుళి, "ఇదుక్కు వేదాంతత్తిల్ శొల్లుకిఱ కట్టళైయిలే పొరుళాక**

**అమైయాదో? "ఎన్ను ఇజ్ఞనే అరుళిచ్చెయ్‌దార్. అదావదు – "ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ" ఎన్నుమ్, "ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" ఎన్నుమ్ శొల్లుకిఅపడియే".**

**(మెయ్‌మ్మేల్ విసై ముగ్ఱ్రవుమ్)**...... "ఋణాలు – అంటే – శరీరం ద్వారా ఏర్పడే కర్మలు అన్నీ నశిస్తాయి" – అని ఆళవందార్ పలికారు. దీనిని శ్రీరామానుజులు విని, దీనికి వేదాంతంలో చెప్పబడే రీతిలో అర్థం చెప్పవచ్చు కదా" అని పల్కుతూ, ఈ విధంగా అన్నారు. అది ఏమంటే – **"ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** – (అగ్నిలో పడిన రెల్లుగడ్డిముక్క దగ్ధమై రూపుమాసి పోయేటట్లు ఈ ముక్తుని పాపాలన్నీ నశించిపోతాయి) ఈ విధంగా ముక్తుని అన్ని పాపాలు తొలగిపోతాయి – అనే వేదాంతప్రక్రియలో ఉత్తరాఘపూర్వాఘాలకు అశ్లేష వినాశాలు కల్గుతాయి – అని.)

**"వేజ్ఞడత్తుఱైవార్‌క్కు నమ"** (వేంకటాద్రిపై వేంచేసి ఉండేవానికి నమస్కారం) అనేవారికి **"వేమ్ కడజ్ఞళ్ మెయ్‌మేల్ విసై ముగ్ఱ్రవుమ్"** అని నమ్మాళ్వార్లు పాశురంలో పలికారు. ఇక్కడ **"కడజ్ఞళ్"** అనే పదం, **"మేల్ విసై"** అనే పదం పాపాలను లక్షిస్తాయి. ఈ రెండు పదాల ద్వారా పాపాలను లక్షించడం లోని తాత్పర్యాన్ని వివరించే నమ్బిళ్ళై తమ ఈడువ్యాఖ్యలో ఆళవందార్, ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన నిర్వాహాలనుగూర్చి ప్రస్తుతించారు.

ముందుగా ఆళవందార్ నిర్వాహం ప్రస్తుతింపబడుతున్నది. **"కడజ్ఞళ్"** – **"కడన్ కళ్"** అంటే – ఋణాలు అని అర్థం. మానవుడు జన్మించేటపుడే మూడు ఋణాలను తీర్చవలసినవాడై పుడతాడు. యజుర్వేదం షష్ఠకాండలో – **"త్రిభి ఋ ఋణవా జాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యః, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః ఏష వా అనృణః"** (మూడు ఋణాలను కలవాడై మానవుడు జన్మిస్తున్నాడు. ఆ మూడు ఋణాలలో – ఋషి ఋణాన్ని బ్రహ్మచర్యాశ్రమంలో వేదాధ్యయనాన్ని చేయడం ద్వారా, దేవఋణాన్ని గృహస్థాశ్రమంలో యజ్ఞయాగాదులను నిర్వహించడం ద్వారా, పితృఋణాన్ని సత్సంతానాన్ని పొందడం ద్వారా తీర్చుకొంటున్నాడు. అపుడు ఋణం లేనివాడవుతున్నాడు) అని చెప్పబడింది. దీనిని

అనుసరించి మనుధర్మశాస్త్రంలో కూడా **"ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్, అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః"** (మానవుడు మూడు ఋణాలను తీర్చుకొని మనస్సును మోక్షంలో లగ్నం చేయాలి. ఋణాలు తీర్చకుండా మోక్షకోసం యత్నించేవాడు నరకంలో పడతాడు) అని తెలుపబడింది. ఈ ఋణాలు మూడు **"వేజ్ఞడత్తుతైవార్‌క్కు నమః"** అని పల్కితే తీరిపోతాయి. (**"కడన్‌కళ్ వేమ్"** – ఋణాలు నశిస్తాయి). తరువాత పాశురంలో కల **"మెయ్"** అనే పదం శరీరాన్ని తెల్పుతుంది. **"మెయ్ మేల్‌వినై"** – అంటే – శరీర సంబంధం వల్ల కలిగే పాపాలు – అని అర్థం. శరీరంతో జీవుడు జీవించి ఉండేటపుడు ఇతడు కొన్ని పాపాలను జ్ఞాతాజ్ఞాతాలుగా చేయడం తటస్థిస్తుంది. ఆ పాపాలు కూడా **"వేజ్ఞడత్తుతైవార్‌క్కు నమః"** అని పల్కితే, **"వేమ్"** – నశిస్తాయి ఈ విధంగా జన్మతః ప్రాప్తించిన మూడు ఋణాలు, శరీర సంబంధ నిబంధనంగా ఏర్పడే పుణ్యపాపాలు ఇక్కడ క్రమంగా **"కడన్‌కళ్"** అని, **"మెయ్‌మేల్ వినై"** అని చెప్పబడ్డాయి – అనేది ఆళవందార్ పల్కిన అర్థ నిర్వాహం.

ఈ నిర్వాహంలో **"కడన్‌కళ్ వేమ్, మెయ్ మేల్ వినై ము*గ్‌ఱ*వుమ్ వేమ్"** (ఋణాలు తీరి పోతాయి, శరీరంవల్ల ఏర్పడే కర్మలన్నీ తీరిపోతాయి) అని అన్నందున ఋణాలుగా చెప్పబడే బ్రహ్మ చర్యాదులను అనుష్ఠించనక్కరలేదనే భావం స్ఫురిస్తున్నది కదా! – అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. ఇక్కడ గమనించవలసినది ఏమి? అంటే, "ఋషులు మొదలైనవారి పట్ల ఉండే ఋణాన్ని తీర్చడంకోసం బ్రహ్మచర్యాదులు చేయకపోతే ప్రత్యవాయం ఏర్పడుతుందే!" అనే భయంతో బ్రహ్మచర్యాదులను అనుష్ఠించనక్కర లేదు. భగవత్కైంకర్యబుద్ధితో అనుష్ఠిస్తే చాలు. ఆ ఋణాలు వాటికి అవే తీరిపోతాయి. భగవానుడే ఉపాయం, ఉపేయమనే అధ్యవసాయాన్ని కలవారు కృతకృత్యులు కదా! **"విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్వతో యే తేషాం రాజన్! సర్వయజ్ఞాః సమాప్తాః"** (శ్రీకృష్ణుని యథాతథంగా తెలిసినవారు ఎవరో, రాజా! వారు చేయవలసిన యజ్ఞాలన్నీ చేసి ముగించినట్లే) అని కదా చెప్పబడుతున్నది. భాగవతంలో కూడా– **"దేవర్షి భూతాప్తనృణాం పితౄణాం న కింకరో నాయమృణీ చ రాజన్!, సర్వాత్మనా యః శ్శరణం శరణ్యం నారాయణం లోకగురుం ప్రపన్నః"** (రాజా! ఎవడు, శరణు పొందదగినవాడు, లోకగురువు అయిన నారాయణుని శరణంగా సర్వాత్మనా శరణు

పొందాడో, అతడు, దేవతలకు, ఋషులకు, ఆప్తులైన మానవులకు, పితృ దేవతలకు కింకరుడు కాడు, ఋణం ఉన్నవాడు కాడు) అని ఈ విషయం చెప్పబడింది. ఈ ఆళవందార్ నిర్వాహంలో **"మెయ్‌మ్మేల్ వినై ముற்றవుమ్"** అనేది పూర్వాఘ – ఉత్తరాఘాలను రెండిటిని తెలుపుతుంది.

**"సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే, తస్మాద్వేంకటశైలోయం లోకే విఖ్యాత కీర్తిమాన్"** – (పాపాలన్నీ **"వేం"** అనే అక్షరంతో చెప్పబడతాయి. కట శబ్దం వాటి దాహాన్ని తెల్పుతుంది. అందువల్ల ఈ పర్వతం వేంకటమని లోకంలో ప్రఖ్యాతిని పొందింది) – అనే పౌరాణికమైన వేంకటశబ్ద నిర్వచనానికి, **"శెన్లు వణఙ్గుమినో శేణుయర్ వేఙ్గడత్తై నిన్లు వినై కెడుక్కుమ్ నీర్మైయాల్"** – (పాపాలను పోగొట్టే స్వభావాన్ని కల, ఎత్తైన వేంకటాద్రిని నమస్కరించండి) ఇత్యాది దివ్యసూరి సూక్తులకు ఇది అనుగుణం.

ఇక, శ్రీరామానుజుల అర్థ నిర్వాహం తెలుపబడుతున్నవి. ఈ నిర్వాహం రెండు విధాలుగా చూపబడింది.

ఆళవందార్ నిర్వాహాన్ని ఆలకించిన శ్రీరామానుజులు, ప్రకృత ఆழ్వార్ల సూక్తికి వేదాంతప్రక్రియలో అర్థం చెప్పవచ్చునని తలచి తమ నిర్వాహాన్ని ఈ రీతిలో తెలిపారు. **"సహస్రశాఖాం యోద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్"** (వేయిశాఖలను కల ద్రావిడభాషామయమైన వేదసంహితను – అంటే – సామ వేదాన్ని దర్శించినవారెవరో) – అని పల్కినట్లు తిరువాయ్‌మొழி సామవేద సారం కదా! భగవంతుని శరణు పొందినవారి పాపాలన్నీ తీరిపోతాయి – అనే విషయాన్ని **"తద్యథా ఇషీకతూలమ్ అగ్నౌ ప్రోతం ప్రదూయేత, ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** (అగ్నిలో పడిన రెల్లు గడ్డిముక్క నామరూపాలు లేకుండా నశించి పోయేటట్లే, ఈ ముక్తపురుషుని ప్రారబ్ధ, సంచితాలనే అన్నిపాపాలు నశించి పోతున్నాయి కదా) అని, **"తద్యథా, పుష్కర పలాశే ఆపో న శ్లిష్యంతే, ఏవం విది పాపం కర్మ న శ్లిష్యంతే"** (తామర ఆకుకు నీరు అంటనట్లే, బ్రహ్మజ్ఞానికి ఆగామి కర్మలేమీ (ఉత్తరాఘాలు ఏమీ) అంటవు) అని ఛాందోగ్యోపనిషత్తు తెల్పింది. ఈ విధంగా పూర్వాఘాలు (ప్రపన్నుడు శరణు పొందడానికి ముందు అతనిచే చేయబడిన

కర్మలు), ఉత్తరాఘాలు (శరణాగతికి పిమ్మట ప్రామాదికంగా చేయబడిన కర్మలు) – అనే రెండు విధాలైన కర్మలు బ్రహ్మజ్ఞానికి కలుగవని చెప్పబడింది. ఇదే విషయాన్ని **"తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ, తద్వ్యపదేశాత్"** (4-1-13) అని దీనిని గూర్చి బ్రహ్మసూత్రాలలో తెలుపబడింది. ఈ రెండు పాపాలు ప్రకృతపాశురంలో **"కడఙ్గళ్"** (పూర్వాఘాలు) అనే పదంతో, **"మేల్ వినై"** (ఉత్తరాఘాలు) అనే పదంతో సూచింప బడ్డాయి. కర్మలనేవి ఋణాలవలె తప్పక అనుభవించి తీర్చుకోవలసినవి కనుక అవి ఋణాలనే అర్థమిచ్చే **"కడఙ్గళ్" (కడన్కళ్)** అని నిర్దేశింపబడ్డాయని తెలియాలి.

ఇక్కడ శ్రీరామానుజులు రెండు విధాలైన నిర్వాహాలు తెలిపారు. మొదటి నిర్వాహానుసారం **"కడఙ్గళ్ వేమ్, మేల్ వినై ము*ర్ఱ్ఱ*వుమ్ శారా"** అనేది అన్వయ క్రమం. ఇక్కడ ఉత్తరాఘాలు **"మేల్వినై"** అనే పదంచేత స్పష్టంగా చెప్పబడినందున **"కడఙ్గళ్"** అనే పదానికి పూర్వాఘాలనే అర్థం అర్థబలంతో సిద్ధిస్తుంది. ఇక, పాశురంలో లేని **"శారా"** అనే పదం అధ్యాహారం చేసికోబడింది. ఇది, **"ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ, తద్వ్యపదేశాత్"** అనే బ్రహ్మసూత్రబలం వల్ల, **"యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంతే ఏవ మేవంవిది పాపం కర్మ న శ్లిష్యంతే"** అనే శ్రుతివాక్య బలం వల్ల అధ్యాహరింపబడింది. పాశురంలోని **"వేమ్"** అనే పదం వినాశవాచకం.

పూర్వాఘానికి వినాశమని, ఉత్తరాఘానికి అశ్లేషమని చెప్పడం ఎందుకు? వ్యత్యస్తంగా, అంటే – పూర్వాఘానికి అశ్లేషాన్ని, ఉత్తరాఘానికి వినాశాన్ని చెప్ప కూడదా? అనే సందేహం రావచ్చు. వాస్తవానికి పాపమంటే ఏమి? **"యత్తత్ ప్రియం తదిహ పుణ్య మపుణ్యమన్యత్"** (నీకు ఏది ఇష్టమో అది పుణ్యం, వేఱయినది పాపం) అనే రీతిలో పాపమంటే భగవన్నిగ్రహరూపమే కనుక, ఈ జీవుడు అనాదిగా చేసే ప్రతికూలకర్మల బాహుళ్యాన్ని చూచి ఆ స్వామికి కల్గిన నిగ్రహబుద్ధియే. ఇది, ఈ జీవునిలో ఉండే ఏదో ఒక లేశమాత్రమైన ఆనుకూల్యాన్ని చూచి, **"కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి"** (ఏదో ఒకవిధంగా యాదృచ్ఛికంగా చేయబడిన ఒక్క ఉపకారంతో కూడా సంతోషిస్తాడు) అని, **"న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా"** (జీవుని తనకు అతడు ఆత్మీయునిగా భావించినందున,

అతడు చేసే వందలాది పాపాలను స్వామి లెక్కించడు) అని చెప్పబడినట్లుగా శమిస్తుంది కనుక, పూర్వాఘానికే వినాశాన్ని చెప్పాలి. ఆ విధంగా ఆనుకూల్యం కల్గిన తరువాత ప్రామాదికంగా చేయబడిన ప్రాతికూల్యం (ప్రతికూల కర్మలు – ప్రామాదికమైన పాపాలు) పట్ల **"అవిజ్ఞాతా హి భక్తానా మాగస్సు కమలేక్షణః, సదా జగత్ సమస్తం చ పశ్యన్నపి హృది స్థితః"** (సదా ఈలోకాన్ని అంతటిని సాక్షిగా చూస్తూ, జీవుల హృదయంలో ఉండేవాడైనా, కమలాక్షుడైన భగవంతుడు భక్తుల పాపాలను గమనించడు కదా) అనేవిధంగా ఆ ప్రామాదికాలైన ఉత్తరాఘాల పట్ల చూపు సారించడు. కనుక అశ్లేషం చెప్పాలి. ఈ విధమైన నియామకాలున్నందున వేఱు విధంగా పల్కడం పొసగదు. శ్రుతప్రకాశికలో కూడా ఈ విషయం **"సంశ్లిష్టస్య పూర్వాఘస్య అశ్లేషాయోగాత్ వినాశ ఏవ, ఉత్తరాఘస్య తు అశ్లేష ఏవేతి యోగ్యతావశాత్ విభాగః"** (జీవునితో ఇంతః పూర్వమే సంశ్లేషాన్ని పొందినందున పూర్వాఘానికి అశ్లేషమనేది సంభవించదు. కనుక వినాశమే చెప్పాలి. ఉత్తరాఘానికి అయితే సంశ్లేషం లేనందున అశ్లేషమే చెప్పాలి – అని ఈ విధంగా వాటి (పూర్వోత్తర పాపాల) యోగ్యతనుబట్టి విభాగం చేయబడింది) అని తెలుపబడింది. **"వానో మఱి కడలో మారుతమో తీయకమో కానో ఒరుజ్గిత్తుమ్ కణ్డిలమాల్! వన్‌తుయరై"** (ఆకాశంలోనా, సముద్రంలోనా? వాయువులోనా? అగ్నిలోనా? లేక, అడవిలోనా పాపాలన్నీ అణగిపోయాయి. వాటిని చూడలేకున్నాము. ఆహా!) అని నమ్మాఱ్ఱ్వార్లు పెరియతిరువన్దాదిలో, **"శుమ్మెనాదే కై విట్టోడి తూఱుకళ్ పాయ్‌న్దనవే"** అని పెరియాఱ్ఱ్వార్లు పూర్వాఘఉత్తరాఘాల అశ్లేషవినాశాలను తెలిపారు.

శ్రీరామానుజుల రెండవ నిర్వాహంలోని తాత్పర్యం కూడా ప్రథమ నిర్వాహంలోని తాత్పర్యమే అయినా, పదాల అన్వయంలో కొంచెం తేడా ఉన్నది. ఈ అన్వయంలో వినాశార్థకమైన **"వేమ్"** అనే పదం ఉత్తరాఘానికి చెందిన అశ్లేషాన్ని కూడా లక్షిస్తుంది. **"ఛత్రిణో గచ్ఛంతి"** (గొడుగులు కలవారు వెడుతున్నారు) అనే ప్రయోగం ద్వారా నిర్దేశింపబడేవారు అందఱు గొడుగులు కలవారే కానక్కర లేదు. ఎక్కువమంది గొడుగులు కలవారైనా, కొందఱు గొడుగులు లేనివారు కూడా వారిలో ఉండవచ్చు. అందుచేత ఈ ప్రయోగంలో **"ఛత్రి"** – అనే పదం ఛత్రి – అచ్ఛత్రిసముదాయలక్షకమని చెప్పాలి. ఆ విధంగానే ఇక్కడ కూడా **"వేమ్"** అనే

పదం అశ్లేషాన్ని కూడా లక్షిస్తుంది. ఈ అశ్లేషం ప్రామాదికమైన అఘవిషయంలోనే అన్వయిస్తుంది. తెలిసి పాపం చేసిన వాడు ప్రపన్నుడే కాదు. తెలిసి చేసిన పాపమైతే అవశ్యానుభావ్యమే కాగలదు. **"ప్రపన్న ఇతి గర్వేణ న కుర్యాత్ పురు పాతకమ్, జ్ఞాత్వాపి పాతకం కర్మ కుర్వన్ మూఢః పతత్యథ"** ( నేను ప్రపన్నుడను – అనే గర్వంతో పాపాలను చేయరాదు. తెలిసి పాపం చేసిన మూఢుడు నరకంలో పడతాడు) ఇత్యాది సూక్తులు ఇక్కడ స్మరణీయాలు. ఏతావతా – రెండవ నిర్వాహంలో **"కడఙ్గళ్, మేల్ వినై ముర్ఱ్రవుమ్ వేమ్, (ఇదు) మెయ్"** అని అన్వయం.

ఇక్కడ **"మెయ్"** – అంటే సత్యమని అర్థం. ఈ విషయం యథార్థమని ఏవిధంగా నమ్మాలి? అంటే, **"ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** అని వేదం సర్వాఘనిబర్హణాన్ని తెలిసింది కదా! వేదం చెబితే సరిపోతుందా! అది నిజమవుతుందా? అంటే, **"మాతాపితృసహస్రేభ్యో వత్సలతరం శాస్త్రమ్"** ( వేలాది తల్లిదండ్రుల కంటే ఎక్కువ వాత్సల్యాన్ని కల్గినది, వేదం) అని, **"యథాభూతవాది హి శాస్త్రమ్"** (శాస్త్రం, ఉన్నది ఉన్నట్లుగా పల్కుతుంది కదా) అనే విధంగా వేదం పల్కితే అది యథార్థమే అవుతుంది కదా! **"ప్రత్యక్ష మనుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్, త్రయం సు విదితం కార్యం ధర్మసిద్ధి మభీప్సతా"** (ధర్మసిద్ధిని పొందగోరేవాడు ప్రత్యక్షాన్ని, అనుమానాన్ని శబ్దరూపమైన శాస్త్రాన్ని చక్కగా తెలియాలి) అనే ప్రత్యక్ష – అనుమాన – వేదా (శబ్దా)లనే ప్రమాణత్రయంలో శాస్త్రమే ముఖ్య ప్రమాణం. **"శాస్త్రయోనిత్వాత్"** అని అతీంద్రియ విషయాలకు శాస్త్రమే కదా ప్రమాణం.

ఈ విధంగా ప్రామాదికంగా సంభవించిన ఉత్తరాఘాలు పశ్చాత్తాపంతో అశ్లేషాన్ని పొందుతాయి. **"అనుతాపేన శుద్ధ్యతి"** అని, **"కృతే పాపేనుతాపోఽ వై"** అని కదా చెప్పబడుతున్నది. దేశికులు కూడా పూర్వోత్తరాఘాలను గూర్చి రహస్య త్రయ సారంలో – **"ప్రారబ్ధేతరపూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరం, న్యాసేన క్షపయన్ అనభ్యుపగతప్రారబ్ధఖండం చ నః, ధీపూర్వోత్తర పాప్మనానుజ ననాజ్ఞాతేపి తన్నిష్కృతే, కౌటిల్యే సతి శిక్షయాప్యనఘయన్ క్రోడీకరోతి ప్రభుః"** (భగవానుడు మన సంచిత ఆగామి పుణ్య పాపకర్మలను శరణాగతితో పోగొడతాడు. శరణాగతి తరువాత అతడు బుద్ధిపూర్వకంగా చేయనందున, లేక, ప్రమాదవశాత్తు

చేసిన కర్మలను వానిని ప్రాయశ్చిత్తాదులతోను, ప్రాయశ్చిత్తం చేసి లేకపోతే దండనతోను పోగొట్టి, దగ్గరకు చేర్చుకొంటాడు) అని వివరంగా పలికారు. ఈ నిర్వాహం ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో కూడా చూపబడింది.

ప్రారబ్ధకర్మలు, సంచితకర్మలు నశిస్తాయని, ఆగామి కర్మలు అంటవని అనడం ఏవిధంగా కుదురుతుంది? చేసిన కర్మలకు స్వరూపనాశం లేదు కదా? అంటే – వీటిని భగవంతుడు వివిధరీతులలో తీరుస్తాడు. ప్రారబ్ధకర్మలు వింటినుండి వదలిన బాణాలవంటివి. అవి లక్ష్యాన్ని తగులక మానవు. అనుభవైకవినాశ్యాలైన వీనిని ఏవిధంగా స్వామి తీరుస్తాడు? అంటే, ప్రారబ్ధాలను ప్రపన్నుడు ప్రకృతశరీరావసానం వరకు అనుభవించేటట్లు చేసి **"శిక్షయాప్యనఘయన్"** అనే రీతిలో పాపవినిర్ముక్తుని చేస్తాడు. శరీరావసానంలోకూడా అవి పూర్తి కాకపోతే, వాటిని పుణ్యపాపరూపవిషయ విభాగం చేసి, **"సుహృదః సాధుకృత్యాం, ద్విషంతః పాపకృత్యామ్"** అనే రీతిలో పుణ్యాలను అతని స్నేహితులకు, పాపాలను అతనిని ద్వేషించే శత్రువులకు చెందే టట్లు చేసి తీరుస్తాడు. లేకపోతే, నిరంకుశ స్వతంత్రుడు కనుక తన అమోఘ సంకల్పంతో నశింపజేస్తాడు. మహాభారత యుద్ధంలో భగదత్తుడు **"శాధి మాం త్వాం ప్రపన్నమ్"** అని ప్రపన్నుడైన అర్జునునిపై విసరిన అస్త్రాన్ని, **"ఉరసా ధారయమాస"** అని తన హృదయంతో ధరించడం దీనికి దృష్టాంతం. హృదయంతో ధరించడమంటే అమోఘసంకల్పంతో లేకుండా చేయడమే కదా! **"సాధ్యభక్తిస్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** (సాధ్యభక్తి – అనే ప్రపత్తి గొప్పదైన ప్రారబ్ధాన్ని కూడా నశింపజేస్తుంది) అని కదా ప్రమాణం.

సంచితకర్మలు వింటిలో సంధించిన బాణాలవంటివి. ఒక లక్ష్యాన్ని గురిపెట్టి సంధించిన బాణాలు ప్రయోగించే విలుకాని సంకల్పం మారితే ఇంకొక లక్ష్యాన్ని నాటుకొంటాయి. ఆ విధంగానే భగవత్సంకల్పంవల్ల సంచితకర్మలు ప్రపన్నుని తాకకుండా, **"ద్విషంతః పాపకృత్యామ్"** అనేటట్లు అతని శత్రువులను నాటుకొంటాయి. సముద్రునిపై కోపించి అతనిపై సంధించిన బాణాన్ని శ్రీరాముడు, ఆ సముద్రుడు నేరుగావచ్చి పాదాలపై పడి శరణాగతి చేసి, అర్థించగా, సముద్రమధ్యంలోని ద్వీపంలో గల అసురులపై గురిపెట్టి ప్రయోగించడం దీని కొక ఉదాహరణం. ఈ విధంగా శ్రీరామానుజుల నిర్వాహం ఉభయవేదాంత సమన్వయాత్మకం. ఇరుపత్తు

నాలాయిరప్పడిలో కూడా ఆళవందార్, శ్రీరామానుజుల నిర్వాహాలు తెలుపబడ్డాయి. ఒన్బది నాయిరప్పడిలో రెండు నిర్వాహాలు తెలుపబడినా, నామ నిర్దేశం చేయబడ లేదు. ఆఱాయిరప్పడిలో శ్రీరామానుజ నిర్వాహానుసారంగా వివరింపబడింది. పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలో "తిరుమలలో అందఱికి ఆశ్రయణీయుడై వచ్చి నిలచి, నిత్యవానం చేసే స్వామి, అనన్యార్హంగా స్వస్వాతంత్ర్య నివృత్తితో కూడిన అత్యంత పారతంత్ర్యాన్ని సూచించేది, సులభమైనది, స్వరూపానికి తగినది అయన నమో వాకమనే శ్రుతిసిద్ధమైన ఆ వ్యాపారాన్ని అధికారి విశేషాన్ని సూచించేటట్లు తమ శిరస్సులో మోసేవారికి అనుభవిస్తే గాని తీరనివి అయినందున ఋణాల వంటి పూర్వపాపాలను, ఆశ్రయించిన తరువాత సంభవించే ఉత్తరాలను అన్నిటిని తీర్చగా **"తీయినిల్ తూశాకుమ్"** అనే విధంగా అవి దగ్ధమవుతాయి. ఇది నిర్దోషమైన వేదాంతంలో ప్రసిద్ధమైనందున సత్యం" అని వివరింపబడింది. ఇదికూడా శ్రీరామానుజ నిర్వాహాను గుణమే కదా!

